Regd No. M.1118.





# ఆంధ్రపత్రిక

Founder: K. NAGESWARA ROW. SUNDAY EDITION.
Vol. 36. ANDHRA PATRIKA, MADRAS, 6th NOVEMBER 1949 No. 213



# 'ఎన్ని విపత్తులు వచ్చినా భారతదేశం తన వ్యక్తిత్వాన్ని చెక్కు చెదరనివ్వలేదు'

## రూజ్వెల్టు రమ్మన్నప్పుడే నేను అమెరికాకు వచ్చివుంటే చరిత్రగమనమే మారేదేమో!

### విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో భారత ప్రధాని నెహ్రూ ఉపన్యాసం

మాడిసన్ (విస్కాన్సిన్), నవంబరు 4: భారత ప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూ నేడిక్కడ విస్కాన్సిన్ విశ్వవిద్యాలయ విద్యార్థి సమావేశంలో ఉపన్యసిస్తూ, అనేక దశాబ్దాల దీర్ఘ పారతంత్ర్యంలో కూడా భారతదేశం తన వ్యక్తిత్వాన్ని అర్జవాన్ని అణుమాత్రమైనా మణిగి పోనివ్వకుండా నిలవబెట్టుకున్నదని ఉద్ఘాటించెను. పండిట్ నెహ్రూ అమెరికాలో తన ఈ పర్యటనలో మొత్తం 9500 మైళ్లు తిరిగెను. తన సంచారక్రమంలో విస్కాన్సిన్‌తో కలుపుకొని మొత్తం 8 విశ్వవిద్యాలయములను సందర్శించెను. విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో పదివేలమంది విద్యార్థులతో కూడిన బ్రహ్మాండమైన సమావేశంలో పండిట్ నెహ్రూ ఇట్లు ఉపన్యసించెను: "గడచిన 2 శతాబ్దాలుగా ప్రపంచం సాధించిన ఐహిక పురోభివృద్ధితో సాటిరాగల ఆధ్యాత్మికాభివృద్ధిని కూడా మానవజాతి సాధిస్తేనేగాని ప్రపంచశాంతి సుస్థిరంగా నిలువనేరదు."

భారతదేశంయొక్క వ్యక్తిత్వంగురించి ప్రస్తావిస్తూ, పండిట్ నెహ్రూ ఇట్లు చెప్పెను:— "భారతదేశానికి ఒక విశిష్టమైన వ్యక్తిత్వం ఉన్నది. అనేక దశాబ్దాల పరపరిపాలనకు విపత్పరంపరకు సరిదైకూడా భారతదేశం తన వ్యక్తిత్వాన్ని అద్భుతంగా సహజస్వరూపంలో నిలబెట్టుకొనగలిగింది. రాజకీయ స్వాతంత్ర్యం ఉపలబ్ధమైన వెంటనే, ఇంతకాలంగా అణచిపెట్టుకొనిఉన్న ఉత్సాహము వ్యక్తిత్వము ఒక్కసారిగా పైకి ఉబికినవి. ఈ ఉత్సాహాతిరేకం ఒకొక్కప్పుడు తప్పుదోవపడితే పట్టవచ్చును. ప్రపంచంమీద తన వ్యక్తిత్వాన్ని హత్తించి భవిష్యత్తును అనుగుణంగా రూపు దిద్దటానికి భారతదేశం ఉద్యుక్తమౌతున్నది.

నేను చాలా క్లిష్టమైన పరిభాషలో మాట్లాడుతున్నప్పటికీ, ప్రజల చిత్తవృత్తులతోను హృదయాలతోను సన్నిహిత పరిచయం గడించి తద్వారా సేకరించిన ప్రత్యక్షానుభూతినే ఈ మాటలలో నేను వ్యక్తం చేస్తున్నాను. స్వభావానుసారంగా ఒక నిర్దిష్టమైన పంథాలో మేము పురోగించటానికి ప్రయత్నిస్తున్నాము. ఈ పంథా మా వ్యక్తిగత స్వభావాన్ని పట్టి ఏర్పడుచున్నది. నేను దీనికన్న భిన్నమైన మార్గము తొక్కడానికి ప్రయత్నించినట్లయితే, ప్రజలే నన్ను ముదలికించి సరియైన దోవకు మరల్చగలరు. నేటి అంతర్జాతీయ రంగాన్ని యదృచ్ఛగా పరిశీలించినట్లయితే, ఏ పదిమందో పన్నెండుమందో విదేశాంగ మంత్రులు ప్రపంచం అంతా నడుపుతున్నట్లుగా కనిపించవచ్చును. కాని ప్రపంచ రాజకీయాలు ఒకరో ఇద్దరో కూర్చొని ఆడేందుకు చదరంగపు ఆట కాదు. అనుక్షణ పరివర్తమానమైన ప్రపంచంలో మనం నివసిస్తున్నాము. ఈ పరివర్తనం దాదాపు 2 శతాబ్దాల క్రిందట పశ్చిమార్ధగోళంలో పారిశ్రామిక విప్లవంతో ప్రారంభమై ఇప్పటికీ ప్రపంచంలో విరతిలేకుండా సాగుతున్నది.

ఈ పారిశ్రామిక విప్లవం ఎంత ప్రాధాన్యం వహించిందీ అంటే, ఫ్రెంచి విప్లవాన్ని ప్రపంచంలో ఇతరత్ర జరిగిన వివిధ విప్లవములను కూడా అది మరుగుపుచ్చింది. మానవజాతి ఈ ఐహిక పురోగమనంతో పాటు మానసిక పురోగమనాన్ని సాధించలేక పోయింది. మనం ఇప్పుడు ఐహికంగా ఒక అడుగు ముందు, ఆధ్యాత్మికంగా ఒక అడుగు వెనుక వేసి ఉన్నాము.

ప్రాచ్యఖండంలోని ఋషులు ద్రష్టలు మానవ జీవితాన్ని సమగ్రమైన దృష్టితో పరిశీలించి అవగాహన చేసుకున్నారు. కాని పాశ్చాత్య ప్రజలు ఆధ్యాత్మిక జీవితాన్ని నిర్లక్ష్యం చేసి ఐహిక పురోగమనం పొందనే ప్రధానంగా దృష్టి కేంద్రీకరించిరి.

మానవ జాతియొక్క ప్రస్తుతస్థితి ఇంత అసవ్యస్తంగా ఉండడానికి ఇదే హేతువు. సర్వ కక్ష్యలలోను సమాన పురోగమనానికి బదులు వక్రగతి తటస్థించింది. ఐహిక సంఘటనా పరంపరయొక్క శరవేగంతో మానసిక పురోగమనం అందుకోలేకపోయింది. ఈనాటికి బ్రహ్మాండమైన సాంకేతికాభ్యుదయమంతా మనుష్య విజ్ఞానం మూలంగానే సాధ్యమైంది. కాని

(8-వ పేజీ తరువాయి)

వైట్ సల్ఫర్ స్ప్రింగ్సులోని గ్రీన్ బయర్ హోటలులో అమెరికా రక్షణమంత్రి జాన్సన్ చేసిన విందు సందర్భంలో మరొక దృశ్యం: ప్రధాని నెహ్రూ మరొక అతిథితో ఛలోక్తులాడి నవ్విస్తున్నారు. —ఇంటర్నేషనల్ న్యూస్ ఫోటో.

వైట్ సల్ఫర్ స్ప్రింగ్సులో భారతప్రధాని నెహ్రూకు అమెరికా రక్షణశాఖామంత్రి లూయిస్ జాన్సన్ ఆతిథ్యం. శాకాహారి అయిన నెహ్రూకు ఫలాహారం ఇచ్చి, భారతప్రధాని ఆరోగ్యాన్ని అభిలషిస్తూ జాన్సన్ షాంపేన్ పుచ్చుకుంటున్న దృశ్యం.

## ఢిల్లీ సిక్కు ఊరేగింపుపై పోలీసు కాల్పులు

### 10 మందికి గాయాలు

న్యూఢిల్లీ, నవంబరు 4: ఢిల్లీ మేజస్ట్రేట్ ఉత్తరువులను ఉల్లంఘించి నేటి సాయంత్రం ఇక్కడి సిక్కులు బయలుదేరదీసిన ఊరేగింపును చెదరగొట్టటంకోసం పోలీసులు లాటీచార్జీ చేసి, అనంతరం నాలుగు సార్లు తుపాకులు కాల్చారు. పోలీసులకు, ఊరేగింపుదార్లకు సంఘర్షణ జరిగినదనీ, అందులో ఇద్దరు పోలీసులు, 7గురు ఊరేగింపుదార్లు గాయపడ్డారనీ, కాల్పులవల్ల మరొక ఊరేగింపు దారుడూ గాయపడ్డట్లు చెప్పబడినది.

ఊరేగింపు సీసగంజ్ గురుద్వారా దగ్గర బయలుదేరినది. చాందినీచౌక్ దగ్గర పోలీసులు దానిని అడ్డగించి చెదరిపొమ్మని చెప్పగా వాళ్ళు వినక పోలీసులను నెట్టివేసి పోవాలని ప్రయత్నించారు. దానిమీద పోలీసులు లాటీచార్జి జరిపి బాష్పవాయు తోటాలను కొన్నిటిని పేల్చారు. అప్పుడు గుంపు చెదరిపోయింది. కాని మళ్ళీ కొంసేపటికి ఊరేగింపు మళ్ళీ బయలుదేరింది. పోలీసులు మళ్ళీ బడాటూటీ దగ్గర ఆటకాయించ పోయేటప్పటికి ఊరేగింపుదార్లు రాళ్లు రువ్వారనీ, దాని మీద పోలీసులు కాల్పులు జరిపారనీ చెప్పబడినది.

నానక్ జన్మదినోత్సవానికి వెనకటి మార్గాల వెంబడి కాక క్రొత్త రోడ్ల వెంబడి ఊరేగింపు జరపటానికి గురుద్వారా ప్రబంధక్ కమిటీ అనుమతి కోరినదనీ, నానక్ జన్మదినం రేపే కాని ఈవేళ కాదనీ, జన్మదినం నాడు ఊరేగింపు జరపటానికి అనుమతించాను; కాని మార్గం మార్చటానికి అంగీకరించ లేదనీ జిల్లా మేజస్ట్రేట్ తెలియజేశాడు.

ప్రబంధక్ కమిటీ వాళ్లు మొదటి నుంచీ అనుశ్రుతంగా వస్తున్న లెక్కను తీసి వేసి వేరే ఇతర కార్యక్రమం మరొక దానితో జోడించేటి నిమిత్తం జన్మదినం ఒకరోజు ముందు జరపాలని కోరినట్లూ దానికి మేజస్ట్రేటు నిరాకరించినట్లూ ప్రభుత్వ ప్రకటన తెలియజేస్తున్నది. కాల్పులు జరిగిన తరవాత గాయపడిన వారు ఆస్పత్రికి చేర్చబడ్డారు. అప్పుడు అక్కడమళ్లీ గుంపుచేరి ఎంతచెప్పినా చెదరిపోకుండా కొంచం సేపు నిలబడి, చివరకు ఖాల్సా కాలేజి భవనానికి శంకుస్థాపన జరపవలసిన ప్రదేశానికి వెళ్లారు. కొంతమంది ఉపన్యాసాలు చేసిన తరవాత చెదరిపోయినారు.

## కాశ్మీరు కాందిశీకులపై పాకిస్తానువారి అత్యాచారాలు

శ్రీనగరు, నవంబర్ 3: భద్రతామండలిలో కాశ్మీరు సమస్యపై చర్చవచ్చినప్పుడు, పాకిస్తానువారు కాశ్మీరు కాందిశీకులపై సాగించే అత్యాచారాలనుగురించి విచారణజరగాలని కోరవచ్చును. ఈ అత్యాచారాలు నానాటికి హెచ్చుతున్నట్లుగా ఇక్కడి అధికారవర్గాలకు తెలియవస్తున్నది.

కాశ్మీరుదాడి అనంతరం కాశ్మీరు నుండి పాకిస్తానువెళ్లిన వారిపైనా, పాకిస్తానులో చిక్కిపోయిన కాశ్మీరులపైనా పాకిస్తానువారు ఇటీవల దారుణచర్యలు సాగిస్తున్నారట.

దీనికి నిదర్శనంగా అక్టోబరు 30వ పాకిస్తాను రేడియోవారు ఒకప్రకటన చేస్తూ, షేక్ అబ్దుల్లా ప్రభుత్వవిరోధుల వలెనటిస్తూ ఆ ప్రభుత్వంచేత పంపబడిన పంచమాంగదళం వారు ఆజాద్ కాశ్మీరులో ఉద్యోగాలు సంపాదించి ఆ సంస్థలో విభేదాలుకల్పింపజూస్తున్నారని ఆరోపించారు.

ఒకనాడు పాకిస్తాను దయకు పాత్రులైన కాశ్మీరు కాందిశీకులు అకస్మికంగా శత్రువులవలె పరిణమించడాన్ని బట్టి, కాశ్మీరు వాసులను పాకిస్తానులో జరచుకోలేక పోయినట్లు స్పష్టమవుతున్నది.

గత జూలైలో షాహ్ కాందిశీక శిబిరంలో పాకిస్తానీ పోలీసులు తుపాకులు కాల్చి 150 మందిని చంపిన నాటినుండి. కాశ్మీరీ శరణాగతులపై పాకిస్తానువారి అత్యాచారాలు హెచ్చినవని జమ్ము, కాశ్మీరు ప్రభుత్వ ప్రతినిధి ఒకరు నేడిక్కడ అన్నారు. కాశ్మీరీ వారిపై పాకిస్తానువారు నిఘా ఉంచుతున్నారట. కాశ్మీరు శరణార్థి శిబిరాల వార్తలు పైకిరావడంలేదట.

ఈ పరిస్థితులను గురించి తమ ప్రభుత్వం చాలా ఆందోళన చెంది ఉన్నదనీ, పాకిస్తాను దౌర్జన్యం నుంచి కాశ్మీరీలను రక్షించడానికి శక్తివంచన లేక పాటుబడుతుందనీ, ప్రపంచంలో ఉన్న ఉన్నత న్యాయస్థానాలకు పోయి పాకిస్తానులోని కాశ్మీరీలను రక్షించడానికి సిద్ధంగా ఉన్నదనీ, ఈయన అన్నాడు.

## పర్షియా మాజీ ప్రధానిపై తుపాకీ కాల్పు

టెహరాన్, నవంబరు 4: పర్షియా మాజీ ప్రధాని అబ్దుల్ హుసేన్ ఆజీర్ ఈవేళ ఒకవ్యక్తిచే తుపాకితో తీవ్రంగా గాయపరచబడ్డాడు. ఈ సంఘటన జరిగిన వెంటనే టెహరాన్‌లో మార్షల్‌లా జారీ చేయబడ్డది.

ఆజీర్ పర్షియా మంత్రివర్గంలో ఒక సభ్యుడు. సాపాసహాన్ మసీదులో మత సంబంధమైన కార్యక్రమంలో పాల్గొంటూ ఉండగా అతనిమీద ఈ దౌర్జన్యం జరిగినది. తుపాకి కాల్చినవ్యక్తి ఒకముస్లిం మతోన్మాది అని తెలుస్తున్నది. ఈదెబ్బ నుంచి ఆయన కోలుకునే ఆశ కనిపించటం లేదు.



## పోర్చుగీసు మకావోకు దక్షిణ చైనాలోని జాతీయప్రభుత్వ సేనలపరుగు

### కమ్యూనిస్టుసేన వెంటబడి తరిమివేసింది

హాంకాంగ్, నవంబర్ 4: దక్షిణచైనాలో మిగిలి ఉన్న కొమింటాంగ్ సేనలన్నీ ఈవేళ హాంకాంగ్‌కి పడమరగా ఉన్న పోర్చుగీస్ అధినివేశం మకావోలోకి పారిపోతున్నవి. ఈ సరిహద్దులకు రెండు మైళ్లవరకూ కమ్యూనిస్టుసేనలు వీరిని నెట్టివేస్తూ వచ్చినవి. పోర్చుగీస్ సరిహద్దు రక్షకులు వీళ్లందరిని నిరాయుధుల్ని చేసి సైనికగుర్తులు ఉంటే వాటన్నిటినీ విప్పించి లోపలికి వెళ్లనిచ్చారు. కొమింటాంగ్ సేనల్లో మరికొన్ని పడవలమీద హైనాన్ ద్వీపానికి వెళ్లిపోవు చున్నవి.

పోర్చుగీసు అధికారులు తమ సేనను అవాంతరాలు రాగలవనే ఉద్దేశంతో సన్నద్ధం చేశారు.

### పారిస్ రాయబార కార్యాలయంలో తగాదా

పారిస్, నవంబరు 4: ఇక్కడి చైనీస్ రాయబారి కార్యాలయంలో కమ్యూనిస్టు అభిమానులు కార్యాలయంలో పై అంతస్తును నిన్నరాత్రి ఆక్రమించుకుని కింది అంతస్తులోఉన్న అధికారుల (కొమింటాంగ్ పక్షం)తో తగాదా ప్రారంభించారు. అయితే దౌర్జన్యమేమీ జరగలేదు. దానిమీదట తాత్కాలిక రాయబారి ఫ్రెంచి పోలీసుల సహాయంకోరగా వారు ఈవేళ మధ్యాహ్నం కార్యాలయంలో ప్రవేశించేముందు కమ్యూనిస్టు అభిమానులు సమావేశం జరిపినిమిత్తం బయటికి వెళ్లిపోయినారు. కార్యాలయంలో ఫ్రెంచి పోలీసులు కాపలా కాస్తున్నారు.

కొన్నివారాల కిందట రాయబారి కార్యాలయోద్యోగుల్లో ఎక్కువమంది కమ్యూనిస్టు ప్రభుత్వానికే విధేయులమనీ, అక్కడికే సైనాను ఉద్ధరించగలవని ప్రకటించారు. అప్పటివరకూ రాయబారి గాయన్ని వ్యక్తినికూడా కొమింటాంగ్

(8 వ పేజీచూడుడు)

## పశ్చిమగోదావరి కాంగ్రెస్ కార్యవర్గంపై శిక్షణచర్య

### ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుని సస్పెన్షన్ ఉత్తరవు

### వ్యవహారనిర్వహణకు ప్రత్యేకాధికారి నియామకం

(ట్రంక్‌ఫోను ద్వారా)

విజయవాడ, నవంబరు 5: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ యన్. జి. రంగాగారు యీవాళ పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, వత్సవాయి గంగరాజు జనరల్ సెక్రటరీ శ్రీ బ్రహ్మయ్య, నడింపల్లి తిరుపతిరాజు (జాయింట్ సెక్రటరీలు) మాగంటి సీతారామరాజు; డా॥ ములుపూరి రంగయ్య, డి. నారాయణరాజు, యం. నారాయణస్వామి మాగంటి బాపినీడు యం. యల్. ఏ. గార్లను కార్యవర్గసభ్యత్వంనుండి 2 మాసములవరకు సస్పెండు చేస్తూ యీ దినం క్రమశిక్షణ ఉత్తరవు జారీచేసిరి. వీరిలో మరి 13 మంది సహాయములో పశ్చిమ గోదావరి జిల్లాబోర్డు అధ్యక్షుని ఎన్నికలలో కాంగ్రెస్ అధికార అభ్యర్థిని ఓడించుటకు ప్రయత్నించి ఒకఓటుతో కాంగ్రెస్ అభ్యర్థిని ఓడించినారని ఏ. పి. సి. సి. కార్యదర్శి శ్రీ ఓబులరెడ్డిగారు గావించిన రిపోర్టుమీద యీ చర్య గైకొనబడెను. ఈ మధ్యకాలంలో పశ్చిమగోదావరిజిల్లా కాంగ్రెస్ సంఘవ్యవహారములు చూచుకొనుటకు శ్రీ ఈదుపుగంటి శివమూర్తిగారిని స్పెషల్ ఆఫీసరుగా రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు నియమించియున్నారు.

### ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గసభ

విజయవాడ, నవంబరు 5: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గసభ నవంబరు 9, 10 తేదీలందు విజయవాడలో జరుగును. జనరల్‌బాడీ సమావేశము అజెండా సిద్ధపరచు విషయములు ఆలోచింపబడును. అన్ని జిల్లాబోర్డుల అధ్యక్షులు పురపాలక సంఘాధ్యక్షులు పై రాష్ట్ర కాంగ్రెస్ సభ్యసభ్య సమావేశానికి వచ్చి ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమై ప్రజాభిప్రాయము ఏరీతిగానున్నదీ తెలుపవలసినదిగా కోరబడుచున్నారు.

## ప. గో. జిల్లా బోర్డు అధ్యక్షుని ఎన్నిక

### ఓబులరెడ్డిగారికి శ్రీ బాపినీడుగారి జవాబుపై విమర్శ

బాచిన సుబ్బారావు ప్రభృతుల ప్రకటన

ఒంగోలు, నవంబరు 3: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సభ్యుడు బాచిన సుబ్బారావు బాపట్ల తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు పుల్లెల రత్తయ్య, గుంటూరు జిల్లా కాంగ్రెసు సభ్యుడు కొసరాజు అమ్మయ్య, వరుపూరి వీరయ్యగార్లు ఈ క్రింది ప్రకటన చేసిరి. పశ్చిమగోదావరి జిల్లా బోర్డు అధ్యక్ష ఎన్నిక విషయమై రాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి ఓబులరెడ్డిగారి సమాధానముగా మద్రాసు ప్రభుత్వము మంత్రి మాగంటి బాపినీడుగారు చేసిన ప్రకటనలో మా పేర్లు, మా ప్రకటన ఉదహరించుట ఆశ్చర్యముగా ఉన్నది.

గుంటూరుజిల్లాబోర్డు అధ్యక్ష నియామకములో రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గము వారు చేసిన నిర్ణయము న్యాయముగా లేదని, మేము విశ్వసించాము. అయినప్పటికి రాష్ట్ర కాంగ్రెసు ఆదేశాన్ని శిరసావహించి, కాంగ్రెసుఅభ్యర్థి విజయాన్ని సాధించటము కాంగ్రెసువాదులమైన మా ప్రధానకర్తవ్యముగా భావించాము. 24 వ తేది కాంగ్రెసుఅభ్యర్థి ఎన్నుకోబడిన తర్వాతనే రాష్ట్ర కాంగ్రెసు నిర్ణయాన్ని గురించి ప్రజలలోగల సందేహాలను తీర్చవలయునని రాష్ట్ర కాంగ్రెసు వారికివిజ్ఞప్తిగా పత్రికా ప్రకటన చేశాము.

గుంటూరుజిల్లాబోర్డుకు ప్రెసిడెంట్ సెలక్షన్‌లో న్యాయం జరుగలేదను అభిప్రాయమును విచారించి, అవసరమైనచర్య తీసుకొనుటకును, ముఖ్యంగా ఇకముందు ఇలాంటి నిర్ణయాలు చేయునప్పుడు తప్పు జరగకుండా చూచుటకును, రాష్ట్ర కాంగ్రెసువారిని కోరుటయే మా ప్రకటన ఉద్దేశ్యమైయున్నది.

రాష్ట్రకాంగ్రెసు చేసిన నిర్ణయాన్ని పాటించక, క్రమశిక్షణకు భిన్నంగా సంచరించి, కాంగ్రెసు ఓటమికి కారణమైనట్లు భావించబడిన చర్యలను సమర్థించుటకు మా ప్రకటనలో అవకాశంలేదని స్పష్టపరచుచున్నాము. పశ్చిమగోదావరి జిల్లాబోర్డు అధ్యక్షుని ఎన్నికలో తమమీద మోపబడిన ఆరోపణలు నిజమైనవి కాకున్నచో, కాంగ్రెసుఅభ్యర్థి విజయంకొరకు, తాము ఏమిచేసినదియు, తనమీద మోపబడిన నేరములు ఏవిధంగా ఆధార రహితమో తెలియజేసుకొనుటకు బదులు గుంటూరు జిల్లాబోర్డు విషయమై రాష్ట్రకాంగ్రెసు నిర్ణయానికి మేముచేసిన ఆక్షేపణను తోడుజేసుకొనుటలో బాపినీడుగారి ఉద్దేశ్యమేమిటో తెలియకున్నది.

## దేవదాసి చట్టముక్రింద 13 మందికి శిక్షలు

హొసపేట, నవంబరు 3: ఈ తాలూకా నారాయణదేవర కెరె గ్రామములోని వాల్మీకులు కొందరు తమ పిల్లలను "బసివిలు"గా ముద్రవేయించి, దేవదాసీలుగా వ్యభిచారమునకుగాను విడిచియున్నారని, ఆ గ్రామ వాల్మీకి సంఘాధ్యక్షుడు బి. కె. హనుమంతప్ప అడిషినల్ ఫస్టుక్లాసు మేజస్ట్రేటుకోర్టులో ఫిటీషను పెట్టుకొనెను. మేజస్ట్రేటుగారు విచారణ జరిపి దేవదాసీలుగా వదలిన ముగ్గురు కన్యకలకు తలొక రూ. 200/-లు జరిమానా, వారినట్లు విడిచిన 10 మంది పురుషులలో కొందరికి 3 మాసముల కఠినశిక్ష, కొందరికి సాధారణశిక్షయు విధించిరి.

## మహ్మదీయుని ఇంటికి సైతానుల పీడ

ఈ తాలూకా కొండినాయకనహళ్లి గ్రామమున ఒక మహమ్మదీయుని ఇంటి ముంగిటియందున, గత నాలుగురోజులుగా అప్పుడప్పుడు చిన్న చిన్న రాళ్లు పడుచున్నవి. ఈ రాళ్లు ఎట్లు ఏ వైపునుండి వచ్చునది కనుగొనను ఆ గ్రామస్థులందరును ప్రయత్నించుచున్నారు. గాని తెలియలేదు. నిన్న టినుండి ఇంటిలోను రాళ్లు పడుట ప్రారంభించి, ఒక పిల్లవానికి కొట్టగా గాయము సహితను అయినది. ఈ రాళ్లు దివారాత్రములు అప్పుడప్పుడు పడుచునే యున్నవి. ఆ కుటుంబీకులు మిగుల భీతిలి యున్నారు.

### కీ. శే. మప్పుసువార్త గారు

చీరాల, నవంబరు 2: ఈ పురపాలక సంఘ సభ్యుడు మప్పునిళియం గారి భార్య సువార్త గారు 50 ఏట గతవారం స్వర్గసురాలైనని. ఈ దంపతులకు ఒక కుమారుడు, ఒక కుమార్తె గలరు.

నిన్న సెక్కడి వి. కె. శాస్త్రిగారి అధ్యక్షతలో సువార్త గారి మరణమునకు సంతాపము వెలిపుచ్చుటకు, వలియం గారికి పరామర్శను చెల్లుటకు సభ జరిగెను. (స్వ. వి.)

## వయోజన విద్యాశిక్షణ కేంద్రములు

### శిక్షితులకు సూచనలు

పమిడిముక్కల, నవంబరు 1: ఆంధ్రదేశ వయోజనవిద్య గౌరవ డైరెక్టరు గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు ఇట్లు వ్రాసిరి: కృష్ణజిల్లా పడమటలంకలో 3 వయోజన విద్యాశిక్షణ కేంద్రములు యీ నెల 28 తో ఆరంభమగును. ఇవి ఆరు వారాలు నడువగలవు. ఒక్కొక్క దానిలో 40 మందికి ప్రవేశమిత్తురు. శిక్షణకాలములో వీరికి నెలకు రు. 22-8-0 చొ॥ గవర్నమెంటువారు స్టయిపెండు ఇస్తారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కోశాధిపతి కొమ్మర్తి సీతారామయ్యగారు శిక్షణకు వచ్చిన వారికిని, ఉపాధ్యాయులకును భోజనాది సౌకర్యవిషయంలో సాహాయ్య పడుటకు అంగీకరించారు.

యీ కేంద్రాలలో శిక్షణ పొందగోరే వారు దరఖాస్తులు నా పేరట శ్రీ సర్వోత్తమభవనము-పటమటలంక పడమట కృష్ణజిల్లా అనే విలాసమునకు పంపవచ్చును.

మునిసిపాలిటీలలోను ఫిర్కా డెవలెప్‌మెంటు ప్రాంతాలలోను, లేబరు బస్తీలుండే ప్రాంతాలలోను, త్రాగుడు నిరోధము అమలులోఉండి గ్రామ సంఘాలు యేర్పాటు అయిన ప్రాంతాలలోను, గ్రంథాలయ సంఘాలు వయోజనవిద్యకు పూనుకొనేచోట్లను, హయ్యరు ఎలిమెంటరీస్కూళ్లు హైస్కూళ్లలో వయోజనవిద్య ఆరంభించి పనిచేయ దలచుకొన్న వారికిని ప్రాధాన్య మివ్వడమగును.

### శిక్షణ పొందినవారికి సూచనలు

ఇదివరలో శిక్షణ పొందిన వయోజన బోధకులు అందరు వెంటనే కేంద్రములు ఆరంభించవలసినదని విద్యాశాఖాధికారులు కూడ గట్టిగా హెచ్చరించినారు. ఆ పనిని చురుకుగా జరిపించ వలసినదని డిప్యూటీ ఇన్స్పెక్టర్లకు తాఖీదులు పంపినారు. మొదట కొంత నిరుత్సాహము కలిగినా విద్యాశాఖాధికారులు యీ దృక్పథము అవలంబించుటచేత ఇప్పుడు మంచి అవకాశము కలిగినది. అయినా తెలుగుదేశములో ఇదివరకు 257 గురు శిక్షణ పొందినా ఇంతవరకు వచ్చిన వార్తలనుబట్టి 68 వయోజన విద్యాకేంద్రాలకంటె యెక్కువ యేర్పడలేదు. విద్యాధికారులు పర్మిషను దొరకక ఆరంభం చేయకుండా ఉన్నట్లు కొందరు తెల్పినారు. ఆరంభంచేసి విద్యాధికారులకు తెలిపితే పర్మిషను ముందుగా పొందకపోయినా తప్పుకాదని విద్యాధికారులు ఇప్పుడు అంగీకరించినారు.

మనకోస్తా అంతటా 450 వయోజన కేంద్రాలకు గ్రాంటుఇవ్వటానికి సర్కారు వారు డబ్బుశాంక్షన్ చేసియున్నారు. ఇప్పటికేర్పడిన కేంద్రాలు 192 కెక్కువ లేవు. అనేకొలకేంద్రాలు ఆరంభించటమే ఆలస్యమైనందువలన 450 కేంద్రాలకు పైబడికూడా గ్రాంటులు ఇవ్వటానికి అవకాశంఉంటుంది. మునిసిపాలిటీలు జిల్లా బోర్డులు స్వతంత్రసంస్థలు తమపూచీమీద ఇంకా యెక్కువకేంద్రాలు పెట్టుకోటానికి అవకాశంఉంది. కాబట్టి శిక్షణ పొందిన, శిక్షణపొందబోయే మిత్రులు పొందినశిక్షణ వృథాకాకుండా చూచుకోవలసిందని కోరుతున్నాను.

20 మంది చదువుకునేవారికి ఒకబోధకుడుండవచ్చుననే నియమాన్ని పురస్కరించుకొని చాలమంది ఆ మాత్రం వయోజనులను చేర్చుకొని తృప్తిపడుతున్నారు. ఇదిసరికాదు. నూటికి నూర్గురుచదువుకునేవారు కావలెననికోరే మనదేశం ఈరీతిగా పనిసాగితే అభివృద్ధికాదు. డిపార్టుమెంటువారి యేర్పాటుప్రకారంకూడా ప్రతి బోధకుడు సంవత్సరానికి నూరుమందిని చదువరులను చేయవలసిన అవసరం ఉంది.

ప్రతిదినము క్రొత్తవారినిచేర్చుకున్నా నష్టంలేదు. అనుమపక్షం మూడుమాసాలకొకసారియైన క్రొత్తవారిని చేర్చుకుంటూ తమవద్దతయారైన చదువరులనూలకంగా తనుచూపుక్రింద క్రొత్తవారికి కొంత బోధజరగడానికి అవకాశంచేసి ఒక్కొక్కరు మరియొకరికి చదువు నేర్పించేవిధానాన్ని అమలుపెట్టితేనేగాని ప్రయోజనంలేదు.

ఈ దృష్టితోనే సర్కారువారు ఇదివరలో వయోజన విద్యాకేంద్రాలకు ఏర్పడిన కార్యక్రమంలో కొంతమార్పు కల్గించినారు. రెండువిధాల పనిజరగడానికి అవకాశాలుచేసినారు. బోధకులైనవారు నాలుగుమాసాల కొకపర్యాయం తమ కేంద్రంలో అభ్యర్థులందరిని చదువరులను చేసి బయటకుపంపి మళ్ళీ మళ్ళీ అట్లా చేయవచ్చును. ప్రతి నాలుగుమాసాల్లోను చదువరులైనవారు కొందరైనా పదరేమూడుసంవత్సరాల చదువు చదవడానికి సిద్ధమైనచోట బోధకుడు అట్టివారికి మూడు సంవత్సరాల విద్యాప్రణాళిక ప్రకారం చదువులు సాగింపవచ్చును. నాలుగుమాసాల్లో వెళ్లిపొయ్యేవారికి జనుపను వ్రాయను అలవాటుచేసి మొదట సంవత్సరపు విద్యాప్రణాళిక కేర్పడినవిషయములు కొంతవరకు చెప్పటానికిపీలుందో అంతవరకే చెప్పేతేచాలును. యీ విషయాలన్నీ సమగ్రంగా గ్రహించి కార్యక్రమము నడపవలసిందని వయోజన విద్యాబోధకులను కోరుచున్నాను.

## ఆంధ్ర కర్నాటక సరిహద్దు సంఘ సమావేశము

### సమాలోచనాంశములపై అభిప్రాయ భేదాలు

ఆదోని, నవంబరు 3: ఆంధ్ర కర్నాటక పరిహద్దు సంఘంవారు నిన్న నిక్కడ కె. నరసింహశాస్త్రిగారి అధ్యక్షతను సమావేశమైనారు. ఉభయరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుల నుండి నియమితులైన ప్రతినిధులు మాత్రము హాజరైరి. సమావేశంలో రంగాగారికి, కర్నాటకరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు నిజలింగప్పగారు వ్రాసిన లేఖను చదివిరి. ఆంధ్ర కర్నాటక ప్రతినిధుల ప్రాతినిధ్యపు అర్హత పత్రములను, విమర్శించు కొనిరి. కర్నాటక ప్రతినిధులకు రాష్ట్ర, జిల్లా కాంగ్రెసు పరంగా అధికారరీత్యా ప్రాతినిధ్యములు లేవనే సంకోచము ఆంధ్రప్రతినిధులు వెల్లడించిరి.

కర్నాటక సభ్యులలో డాక్టరు వి. రామచంద్రరావుగారు అనంతపురం జిల్లాలోని ఆంధ్రకర్నాటక పరిహద్దుల విషయమై మాట్లాడిరి. అనంతపురం విషయంలో అధికారరీత్యా తమ కేలాటి బాధ్యతలు లేవనియు, బళ్ళారిజిల్లా విషయం మాత్రమే ముచ్చటించుటకు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుల వారి ఆదేశమై యున్నదని ఆంధ్రప్రతినిధులు తెలిపిరి. రామచంద్రరావుగారు అనంతపురంవిషయమై పరిష్కరించక మరేవిషయమును పరిష్కరము చేసుకొనుటకు అనుకూలత లేదని చెప్పినందున, ఈ విషయమై ఉభయ ప్రతినిధులు తమ తమ రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులకు తెలుపుకోవలసిందిగా నిశ్చయించుకొనిరి.

కర్నాటక ప్రతినిధులలో, అధ్యక్షుడు నియమించిన బళ్ళారి జిల్లా కాంగ్రెసుకు చెందిన అధ్యక్ష కార్యదర్శులుగాని, రాష్ట్ర కాంగ్రెసు సభ్యులుగాని ఒక్కరైనను లేనందుకు ఆంధ్రజిల్లా కాం. కార్యదర్శి హెచ్. వేంకటేశ్వరరావు గారు తమ నిరసనను వెల్లడించిరి. (స్వ. వి.)

## కడలూరు జెయిలు కాల్పులు

సత్తెనపల్లి, అక్టోబరు 30: శ్రీవావిలాల గోపాల కృష్ణయ్యగారు కడలూరు జెయిలులో ఇటీవల డిటెన్యూలపై జరిగిన కాల్పులవిషయమై అనధికార విచారణ జరిపించవలెనని ప్రభుత్వమును కోరుతూ ఒక ప్రకటన చేశారు.

## సోషలిస్టుపార్టీ కార్యదర్శి పర్యటన

విజయవాడ, నవంబరు 2: అఖిలభారత సోషలిస్టు పార్టీ సంయుక్త కార్యదర్శి ప్రేమ్ భాసిన్ ఈ దిగువ ప్రకారము ఆంధ్రప్రాంత పర్యటనచేయనున్నారు. నవం. 16, 17 లు. కర్నూలుజిల్లా, 18-19 విజయవాడ, 20. ప. గోదావరి, 21 చీరాల, 22. గుంటూరుజిల్లా 23. నెల్లూరుజిల్లా, 24. 25. నెల్లూరులో రాష్ట్ర సోషలిస్టు పార్టీ సంఘ సమావేశం. ఈ పర్యటనోద్దేశం పార్టీ నిర్మాణమే. ఈనెల 12 13 లలో జరుగవలసిన ఆంధ్రప్రాంత సోషలిస్టు పార్టీ మహాసభ వాయిదాపడింది.

## ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనేట్ సభ్యత్వం

### చిత్తూరుజిల్లాస్థానములకు అభ్యర్థుల నిర్ణయం

తిరుపతి, నవం. 3: ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనేటుకు చిత్తూరుజిల్లా బోర్డు, చిత్తూరు-తిరుపతి మునిసిపాలిటీల పక్షమున ఎన్నుకొన వలసిన రెండు సభ్యత్వ స్థానాలకు జిల్లాబోర్డుసభ్యులగు డి. మునిరత్నం నాయుడు, జి. శ్రీరామరెడ్డిగారలను అభ్యర్థులుగా నుంచుటకు నిర్ణయించినట్లు చిత్తూరుజిల్లాబోర్డుఅధ్యక్షుడు శ్రీ యస్. సి. చెంగల్రాయనాయుడుగారు ప్రకటించిరి. (స్వ. వి)

## మదరాసు లాన్‌టెన్నిస్ సంఘం

చెన్నపట్నం, నవంబరు 4: మదరాసు లాన్ టెన్నిస్ సంఘం జనరల్ బాడీ సభ మొన్న బుధవారం జరిగి క్రొత్త సంవత్సరమునకు న్యా॥ ఇ. ఇ. మాక్ గారు అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. శ్రీ యం. రామరావు, శ్రీ సి. రామస్వామిగార్లను ఉపాధ్యక్షులుగను శ్రీ యం. యస్. సాంసన్ పాల్ గారిని గౌరవ కార్యదర్శిగను శ్రీ సి. పద్మనాభంగారిని కోశాధికారిగను సభవారు ఎన్నుకొనిరి.

## కీ. శే. కొమ్మిరెడ్డి నాయుడుగారి కళాసేవ

### గుంటూరు పౌరసభలో ప్రశంసలు

గుంటూరు, నవంబరు 2: కర్నాటక సంగీతకళోద్ధారక దివానుబహదూరు కొమ్మిరెడ్డిసూర్యనారాయణమూర్తి నాయుడుగారి నిర్యాణమునకు సంతాపము తెలుపుటకు నిన్న నిక్కడ ఆచార్య విస్సా అప్పారావుగారి అధ్యక్షతను ఒక బహిరంగసభ జరిగింది. అప్పారావు, శిరం సుబ్బారావు, పర్వతనేని వీరయ్యచౌదరి, టి. యన్. సి. నారాయణాచార్యులు, వింజమూరి శ్రీనివాసచార్యులుగార్లు నాయుడిగారి గుణగణములను శ్లాఘించి కర్నాటక సంప్రదాయసంగీతమునకు వారుచేసిన అమోఘమైన సేవను ప్రశంసించిరి. సంగీత కళోద్ధారగా నాయుడుగారు తమ జీవితం అంకితంచేశారనీ, కాకినాడలో సరస్వతీ గానసభను స్థాపించి తద్వారా యావదాంధ్ర దేశానికంతకు 45 ఏండ్లుగా నిరంతరం కళాసేవచేసి ఆంధ్రజాతికంతకు కీర్తిగడించి ఆంధ్రదేశానికంత సంగీతదీక్ష పెట్టారనీ, కులాభిమానం గాని, రాష్ట్రాభిమానంగాని ఏ మాత్రంలేక విద్య ఎక్కడున్నప్పటికి గౌరవించారనీ అన్నారు. ఆయన గౌరవించని సంగీత విద్వాంసుడులేడు. వారుస్థాపించిన సరస్వతీ గానసభలో కచ్చేరిచేయని సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడెవ్వరూ లేరు. దాక్షిణాత్యులు సహితం సరస్వతీ గానసభలో కచ్చేరిచేయడం అంటే గొప్ప హోదా అని తలచేవారు. అట్టి అపారమైన సేవ మనకు చేసినటువంటి నాయుడిగారి ఋణం మనమెట్లా తీర్చుకోగలం. ఆయన నిరాడంబర జీవితము, ఆయన ఉదారమైన హృదయము, ఆయన సంగీత అభిమానము అన్నీ మనం స్మరించుకొని మన బాధ్యత మనం నిర్వర్తించవలసింది అని ఉపన్యాసకులు మనవి చేశారు. అనంతరం కర్ణాటక సంగీత ప్రపంచానికి శ్రీ సూర్యనారాయణమూర్తి నాయుడుగారు చేసిన సేవలను ప్రశంసించుచు, ఆయన నిర్యాణమునకు సంతాపము తెలుపుచూ, ఆయన ఆత్మకు పరమేశ్వరుడు శాంతి ప్రసాదించుగాక అని ప్రార్థించుచు, ఆయన కుటుంబానికి తమ హృదయపూర్వక సంతాపాన్ని అందజేస్తు తీర్మానించారు.

వింజమూరి శ్రీనివాసాచార్యులగారు వందనములు సమర్పిస్తూ నాయుడుగారి జ్ఞాపకంగా గుంటూరులో సంగీతసభ నొకదానిని శాశ్వతముగా నిర్వహించుపద్ధతిలో ఏర్పాటుచేయుటకు నిశ్చయించడమైనదనియు, ఆసభలో యెల్లరు సభ్యులుగచేరి ప్రోత్సహించవలయుననియు విజ్ఞాపన చేశారు. తరువాత పర్వతనేని వీరయ్యచౌదరి, శ్రీనివాసన్, టి. యన్. సి. నారాయణాచార్లు, చెరుకుపల్లి సత్యనారాయణశాస్త్రి, చేదలవాడ సుబ్బయ్య, మారేముండ వరదాచార్లుగార్లు తమ తమ గాన, వాద్యములతో నాదోపాసన చేశారు. (స్వ. వి.)

## శ్రీ లగడపాటి బాలగురవయ్య మృతి

వినుకొండ, నవంబరు 2: వినుకొండ తాలూకా రైతు కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి గుట్లపల్లి వెంకట సుబ్బారావు గారు క్రింది విధంగా తెలియజేస్తున్నారు:-

వినుకొండ తాలూకా కాంగ్రెసు కార్యవర్గ సభ్యులును, తాలూకా రైతు కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు శ్రీ లగడపాటి బాలగురవయ్య గారు క్షయవ్యాధితో బాధపడి అక్టోబరు 25 వ తేదీన తమ స్వగ్రామమైన ఏనుగ పాలెంలో మరణించారు.

ఈయన. 20 సంవత్సరములు, పంచాయితీ బోర్డు, కోర్టులకు, అధ్యక్షులుగా వుండుటయే గాక, తాలూకాలోని రైతులందరకూ పెద్దగా వ్యవహరించి. అనేక వ్యవహారములు రాజీగా పరిష్కరించి, ప్రజల అవసరమునకు పాత్రులైరి. వీరి మృతికి రైతులు యెక్కువగా దుఃఖిస్తున్నారు.

## సభలు-సమావేశాలు

అనంతపురము, నవంబరు 3: 16 వ ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ ఈ నెల 19,20: తేదీలలో అనంతపురములో జరుగును. నెల్లూరు సహకారకేంద్ర బ్యాంకు అధ్యక్షులు శ్రీ ఆర్. పశరధరామరెడ్డిగారు అధ్యక్షత వహింతురు. కృష్ణాజిల్లా సహకారకేంద్ర బ్యాంకు అధ్యక్షులు రావు బహదూరు కె. వి. రమణయ్యనాయుడుగారు ప్రారంభింతురు. సహకార సంఘాల జాయంటు రిజిస్ట్రారు కె. సుబ్రమణ్యనాయుడుగారు సహకార పతాక ఎగురవేతురు. ఈ సందర్భమున పారిశ్రామిక, వ్యవసాయిక విద్యాప్రదర్శనము కూడ ఏర్పాటుచేయబడినది.

అవనిగడ్డ, నవంబరు 3: ఆంధ్రదేశ ప్రధానోపాధ్యాయుల సంఘం ప్రత్యేక సమావేశం ఈ నెల 19 వ తేదీన సాయంత్రం 7 గం॥ కు విజయవాడ ఎస్. ఆర్. ఆర్. వి. వి. హిందూహైస్కూలులో జరుగుతుందని, సెకండరీ స్కూల్సు ప్రధానోపాధ్యాయులందరూ హాజరుకాగోరుతున్నామని సంఘాధ్యక్షులు వ్రాశారు.

## రాష్ట్ర వార్తలు

### అనంతపురం

కొలది రోజులుగా అనంతపురములో చిన్న చిన్న దొంగతనములు జరుగుచున్నవి. మొన్నరాత్రి కాలేజ హాస్టలు గదుల తాళములు తీసి ఎవరో విద్యార్థుల సూట్లు ఫౌంటెన్ పెనాలు మొదలగునవి చోరీ చేసిరి. మూడు నాల్గు దినముల క్రితము పట్టపగలు మధ్యాహ్న సమయముననే విట్టల్ బిల్డింగ్సు సబ్ పోస్టులు గదులలో చోరీ జరిగెను. చిన్నపిల్లలు తిరుగుచుండగా ఆభరణములు అపహరించుట కూడా ఒకటి రెండు జరిగినట్లు తెలిసినది.

గొల్ల అంజినప్ప అనునతడు మైసూరు రాష్ట్రము నుండి సుమారు వేయిరూపాయిల విలువచేయు గంజాయి కల్యాణదుర్గమునకు తెచ్చుచుండగా పట్టుబడి కల్యాణదుర్గం సబ్ మేజస్ట్రేటుగారిచే 29వ తేదీన 7నెలల కఠిన శిక్షకు గురియయ్యెను.

### ఆదోని

ఆదోనిలో చక్కెర దొరకుట లేదు. వీశ 2-8-0 నుండి 3-0-0 వరకు ఉన్నది. నీకటిబజారులో హెచ్చుగూరకే చక్కెర విరివిగా పంపుచున్నారని వినికిడి. ఈ విషయమును జిల్లాకాంగ్రెసువారు అధికారులకు తెలిపి, తగుచర్యలు తీసుకోవలసిందిగా కోరినారు.

బళ్ళారి జిల్లా రాజకీయ బాధితుల సంఘమును నిర్మించు ఉద్దేశ్యంతో జిల్లా రాజకీయ బాధితులతో సంప్రదించుటకుగాను శ్రీ కే. ఎల్. ఎన్. సోమయాజులు, (సలహా సంఘసభ్యులు)గారు ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలుకాలలో సంచారము చేయుచున్నారు.

### తిరుపతి

మఠములు, దేవాలయముల ఆవరణములను గబ్బిలములు గలీజుగాను, అపరిశుద్ధముగాను చేస్తున్నవిగనుక, వాటిని తొలగించుటకు వెంటనే చర్యతీసుకోవలయునని, హిందూమత ధర్మాదాయపు బోర్డువారు, దేవాలయములు, మఠములయొక్క అధికార్లకు ఉత్తర్వు చేశారు.

అయితే తిరుపతి దేవస్థానం కమిషనర్ గారు, వారి దేవాలయాలలో ఎలుకలు పందికొక్కుల వుపద్రవము అధికముగా యున్నది. గనుక వాటిని తొలగించుటకు మార్గం కోరియున్నారు. మంటపములపై సీలింగు పాగవల్ల నలుపుబారి పోతున్నది. గనుక, దానికి సలహాకూడ కోరియున్నారు. (స్వ. వి.)

### తొండమనాడు

ఫిర్కా రైతులకోరికపై నిన్నటిదినం సాయంత్రం 5 గంటలకు సర్దార్ సుబ్బరామదాస్ (ఎ. పి, సి. సి. సభ్యుడు) గారి అధ్యక్షతన గొప్ప బహిరంగసభ జరిగెను. ఫిర్కా గ్రామాలనుండి రైతులు కూలీలు హరిజనులు వెయ్యిమందికి పైగా హాజరై రైతుల ఇబ్బందులను గురించి మాట్లాడిరి. ఫిర్కా హరిజనసంఘమును, రైతు కాంగ్రెసు సంఘమును స్థాపించిరి. ఫిర్కా హరిజనసంఘమునకు శ్రీరావూరు మునిరెడ్డి, అధ్యక్షుడుగను తొన్నాటి వెంకటస్వామి కార్యదర్శిగను మరి 15 గురు సభ్యులను ఎన్నుకొనిరి. రైతు కాంగ్రెసుకు పస్పులేటి సుబ్రహ్మణ్యం అధ్యక్షుడుగను, శివనాథం గోపాలయ్య కార్యదర్శిగను ఎన్నుకొనిరి.

### మంగళగిరి

శ్రీ పి సీతారామయ్య బి. ఏ. స్థానిక సబ్‌మాజిస్ట్రేటుగారు మద్యనిషేధచట్టం క్రింద సారాదగ్గర వున్నందుకు బాలాది వీసురత్నంకు 2 నెలలు కఠినశిక్ష విధించిరి.

దొంతా సుబ్బమ్మకు రు. 60/-లు, కె.శోభనాద్రికి రు. 60/-లు పలగానికోటప్పకు 70/-లు సారాదగ్గర వున్నందుకు, అమ్ముచున్నందుకు జుల్మానా విధించిరి. ఎన్ని రామయ్య త్రాగినందుకు 6 వారములు కఠినశిక్ష, కె. సోమయ్య త్రాగినందుకు 6 వారముల కఠినశిక్ష విధించిరి. మరి 7 గురు వ్యక్తులు త్రాగియున్నందుకు తలా 50 లు. జుల్మానా విధించిరి.

### శ్రీకాకుళం

29-10-49 తేదీని శ్రీకాకుళం హైస్కూలులో శ్రీకాకుళం సెంట్రల్ బ్యాంకు డైరెక్టర్ల ఎన్నికలు జయప్రదంగా జరిగినవి. 28 29 తేదీలలో నాగావళి, వంశధారానదులు బ్రహ్మాండముగా పొరలుచున్న నూతివిజనులోని కొందరు ఉత్సాహవంతులుగు పక్కిలు డైరెక్టర్లు ఎన్నికలకు వచ్చిరి.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సభ్యుడు శ్రీ కిల్లి అప్పలనాయుడు గారు క్రొత్తగా బాంకు డైరెక్టరుగా జనరల్ సీటుకు ఎన్నుకోబడిరి.

శ్రీయుతులు, పుప్పాల కామేశ్వరరావు (ప్లీడర్ (ప్రాసిక్యూటరు) డాక్టరు

## తూ. పంజాబు అసెంబ్లీ కాంగ్రెసు సభ్యులపై ఆంక్ష

### కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావుగారి తాఖీదు

అమృతసరు, నవంబరు 3: తూర్పు పంజాబు అసెంబ్లీసభ్యులైన సర్దారు శీతల్ సింగు, బాబూ బాచనసింగు, పండిట్ మోహనలాలు సూరి మా. మెహాతాబ్ రణ వీర్ సింగు అనువారు అసెంబ్లీలో తమ సభ్యత్వమునకు రాజీనామా నీయవలెనని కాంగ్రెసు కార్యదర్శియగు కళా వెంకట్రావు గారు ఆదేశించిరి.

తూర్పు పంజాబు కాంగ్రెసు అసెంబ్లీ పార్టీ ప్రధాన కార్యదర్శియగు సర్దారు దిలీపసింగు కాంగుగారికి కళా వెంకట్రావుగారు యీ క్రిందిరీతిగా వ్రాసిరి. సాచారు మంత్రివర్గము రాజీనామానిచ్చిన తోడనే కాంగ్రెసు అసెంబ్లీ పార్టీలో నుండి తొలగిపోవుటకై రాజీనామా నిచ్చియుండిరి. వారు కాంగ్రెసుపార్టీ ప్రతినిధులుగానే అసెంబ్లీసభకు ఎన్నుకోబడిరి. కనుక వారు తమ అసెంబ్లీ సభ్యత్వమునకు కూడా రాజీనామా నీయవలెను.

రైనేడి వెంకట్రావునాయుడు, (చైరమెన్ శ్రీకాకుళం మునిసిపాలిటీ)యిరువురును తిరిగీ డైరక్టర్లుగ అప్పుడే ఎన్నుకోబడిరి.

### రేపల్లె

స్థానికవర్తకుడు కొలిశపల్లి నాగేంద్రము సిమెంటును బస్తా 1 కి రు. 8/-లు చొప్పున అమ్మిన నేరమునకు నవంబరు 1 న సి. ఐ. డి. ఆఫీసరు పట్టుకొని స్థానిక సబ్ జైలులో రిమాండుచేసిరి.

### ఒంగోలు

నిన్న సాయంత్రం శ్రీ యన్. శేషగిరి రావుగారి అధ్యక్షతన ఐ. యల్. టి. డి. కంపెని స్టాఫ్ యూనియన్ వారి సభ జరిగింది. శ్రీ చివుకుల గోపాల కృష్ణమూర్తి గారు, మాట్లాడుచూ, యూనియన్ వారు తమకనీస కోర్కెలను సాధించుటకు అనేక విధముల సామ్యముగా ప్రవర్తించి, "డైరెక్టు యాక్షన్" తీర్మానంచేసి కూడ రాయబారములు జరిపినారనీ, కాని, యివి అన్నియూ కలకత్తా చర్యల తర్వాత విఫలమైనవనియూ, అంతట యూనియన్ అధ్యక్షులు శ్రీ పి.ఆర్. కె. శర్మగారు లేబరు కమీషనరు గారికి తంతి ద్వారా తెలియ జేసిరనియు, యిప్పటి వరకు ఏవిధమైన వుత్తర్వులు రాలేదనియూ, కేంద్ర సంఘ వుత్తర్వు ప్రకారము మరల ఆందోళన జరుప నిశ్చయించితిమనీ తెలిపిరి.

శ్రీపొట్లూరి వెంకటసుబ్బారావుగారు మాట్లాడుచూ యీ సంఘము యొక్క కనీసపు కోర్కెలు చాల న్యాయ సమ్మతముగా ఉన్నవనిరి.

అధ్యక్షులు యితర దేశములలోని వుద్యమములు అచటి ప్రభుత్వంతో వారికి గల సంబంధములు, యిచటి మన పరిస్థితులు వివరంగా తెల్పిరి, ఈ దిగువ నిర్మానము ఏకగ్రీవంగా ఆమోదించిరి. "28-2-49 న యీ సంఘము వారు సమర్పించిన మెమురాండంలోని తమ కోరికలను పునరుద్ఘాటించుచూ కలకత్తా రాయబారములు విఫలమైనందుకు తమ విచారమునూ తెలియ జేయుచున్నారు. పరిశ్రమల కార్మికవర్గముయొక్క లాభదృష్ట్యా, త్వరగా పరిష్కరించవలసినదిగా ప్రభుత్వంవారిని కోరడమైనది.

శ్రీ ములుగూ బాలకోటేశ్వరరావు గారి (కార్యదర్శి) వందనములతో సభ ముగిసెను.

షుమారు 10 రోజుల నుంచి అధికారులు, కోపరేటివ్ స్టోర్సు ద్వారా పట్టణవాసులకు రేషన్ కార్డుకూ వారమునకూ ½ వీశె చొ॥ చక్కెర కంట్రోలు ధర (1-5-6 వీశె) కు అమ్మించుచున్నారు.






### నోటీసు

మద్రాసు సిటీ సివిల్‌కోర్టు

ఓ. ఎస్. నెం. 385 ఆఫ్ 1949

వాది: పెనుగొండ రాధాకృష్ణమూర్తి

ప్రతివాదులు: శ్రీ రాం రాజేశం అప్పన్న శంకరయ్య అండ్ కంపెనీ తరఫున భాగస్థులు, (1) శ్రీ రాం రాజేశం, (2) అప్పన్న శంకరయ్య, (3) ఆర్. మాణిక్యం, (4) అమరా శ్రీశైలం, (5) నంగేసు నారాయణ (6) దిడ్డి నారాయణ, (7) దోరగుంట్ల కాశీనాథం, మర్చంట్సు, వరంగల్.

పై దావా రు 2946-12-0 లు వడ్డీతోను ఖర్చులతోను రాబట్టుకోటానికి తేబడి, మద్రాసు అడిషనల్ సిటీ సివిల్ జడ్జి యెదుట 10-11-49 తేది విచారణకు వాయిదా వేయబడ్డది.

సి. వాసుదేవన్,

వాదితరఫు అడ్వకేటు, మద్రాసు, 4-11-49

## మాహేదగ్గర నడవ తగాదా

### కేంద్రమునకు రాష్ట్ర ప్రభుత్వ నివేదిక

మదరాసు, నవంబరు 4: మాహే (ఫ్రెంచి) దగ్గర నడవపై ఫ్రెంచివారి హక్కు గురించి ఈ సందర్భమున మదరాసు ప్రభుత్వమువారు తీసుకొన్న చర్యను గురించి కేంద్ర ప్రభుత్వమునకు నివేదిక పంపియున్నామని ప్రధాని కుమారస్వామి రాజా నేడు విలేఖరులకు తెలిపిరి.

ఈ నడవ మదరాసుకు సొత్తు. అయితే ఫ్రెంచి అధికారుల ఉత్తర్వుల ననుసరించి నడవను మరమ్మత్తు చేయుటను మునఉద్యోగులు గుర్తించి విచారణ చేయగా ఫ్రెంచివారు అనవ ఎవ ఫ్రెంచివారిదని అనిరి. మదరాసు ప్రభుత్వము నిలబడి హక్కును స్థిర పరుచుకొనలేక ఫ్రెంచివారు అసమ్మతి ప్రకటించుచూ లొంగిరి. ఈ సంఘటన గురించిన నివేదిక ఇండియా ప్రభుత్వమునకు మదరాసు ప్రభుత్వము పంపియున్నది.

## "ఉద్యోగ నిర్ణయ సలహా సంఘం వుండడమే ఖాయం"

### వదంతుల ఖండన: డా॥ రాజన్ ప్రకటన

మదరాసు, నవంబరు 5: మాజీ సైనికుల కొరకు ప్రారంభించిన శిక్షణ కేంద్రములలో సాధారణజనమునకు సాంకేతిక శిక్షణ ఇచ్చుటకు ఇండియా ప్రభుత్వము ఒక ప్రణాళికను తయారు చేయగలదని పునరావాస, ఉద్యోగనిర్ణయశాఖలకు సంబంధించిన, మంత్రి డాక్టర్ టి. యస్. యస్. రాజన్ నిన్న విలేఖరులగోష్ఠిలో ప్రకటించిరి.

ఈఉద్యోగ నిర్ణయ సలహా సంఘము లును శాశ్వతముగనుండి విస్తృత మొనర్చబడునని డాక్టర్ రాజన్ చెప్పిరి.

భూములులేనివారికి భూములు, పనిలేనివారికిపని కల్పించుటకు సహకారసంఘములను, వ్యవసాయ సంఘములను స్థాపించు ఒక జాతీయ ప్రణాళికను తయారు చేయుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నదని డాక్టర్ రాజన్ సూచించిరి.

ఇండియా మొత్తమున సహాయసంఘములతో నమోదు అయిన నిరుద్యోగుల సంఖ్య 29 లక్షలున్నది. ఇందులో 7,39,001 మందికి ఉద్యోగము చూపించిరి. మనరాష్ట్రములో 6 లక్షలమంది నమోదుకాగా 1,34,362 మందికి సహాయ సంఘములు ఉద్యోగము చూపించెను. ఈ అంకెలను బట్టి సహాయసంఘముల పని ఆశాజనకముగా వున్నట్లు తెలియును. నమోదుఅయిన వారందరికి ఉద్యోగము చూపించగలదని ఆశించవచ్చును. నిరుద్యోగులకు ఉద్యోగము కల్పించవలసిన బాధ్యత రాజ్యముపై వున్నది. ఈ విషయము ప్రధానమంత్రికూడ గుర్తించిరి. రాజ్యాంగ పరిషత్ ఈ విషయమును అధికారముల పట్టికా జాబితాలో చేర్చెను. ఇన్ని జరిగిన తరువాత సహాయ సంఘములు తాత్కాలికమని ఎవరూ అనజాలరని అన్నారు డాక్టర్ రాజన్.

## మదరాసు అసెంబ్లీ కార్యక్రమము

మదరాసు, నవంబరు 5: వచ్చే సోమవారంనుండి జరుగు అసెంబ్లీ సమావేశ కార్యక్రమములో అనేక బిల్లులు, తీర్మానములు చర్చకురానున్నవి.

పుదుకోట్టై, హిందూరు, జనగానపల్లి నుంచి కొత్తగ నియమించబడిన శాసనసభ్యులు శ్రీయుతులు ఆర్. నటేశన్, వెంకటేశ సంకటసుబ్బయ్యగార్లు ప్రమాణం స్వీకరించిన తర్వాత స్పీకరు ఈ సమావేశమునకు నల్గురు అధ్యక్షుల పానెలును ప్రకటించెదరు.

పబ్లిక్ అకౌంట్సు కమిటీకి 9 మంది, [illegible] కమిటీకి 6 గురు సభ్యులను ఎన్నుకొనవలెనని, పరిశ్రమల బోర్డుకు ఒక సభ్యుని యస్. ఐ. రైల్వే స్థానిక సలహా సంఘమునకు ఒక సభ్యుని ఎన్నుకొనవలెనని నానా విషయములకు సంబంధించి మంత్రులు ప్రతిపాదనలు చేయుదురు.

స్థానిక పాలనమంత్రి శ్రీకళ్లూరి చంద్రమౌళిగారు భూమితనఖా బ్యాంకు జారీచేయు డిబెంచర్లకు ప్రభుత్వము హామీ ఇచ్చు మొత్తమును 550 లక్షలకు పెంచవలెనని ప్రతిపాదించెదరు.

ఆర్థికమంత్రి, ప్రకటనల బిల్లు సెలెక్టు కమిటీ నివేదికము, దేవాదాయమంత్రి నూగాడీలో గృహదహనాలను నిషేధించు బిలు సెలెక్టు కమిటీ నివేదికలను సమర్పించెదరు.

ఇంకనూ కార్యక్రమములో ప్రభుత్వపు బిల్లు మొదలగు సవరణలును అనేకము కూడ యున్నవి.

## వారఫలాలు

నవంబరు 6 వ తేదీ మొదలు 12 వ తేదీ వరకు

### గ్రహస్థితి

రవి బుధులు (తుల) కుజశనులు (సింహం) గురువు (మకరం) శుక్రుడు (ధనస్సు) రాహువు (మీనం) చంద్రుడు (మేష) వృషభ, మిథున, కటకాల్లో 6 శనిచంద్ర (కోణం) 7 గురుచంద్ర (కోణం) కుజచంద్ర (కేంద్రం) 8 శనిచంద్ర (కేంద్రం) 10 శుక్రచంద్ర (సప్తకం) బుధచంద్ర (కోణం) 12 గురుచంద్ర (సప్తం).

### ధరలు

ప్రత్తి (జారిల్లా) నూలూ వస్త్రాలూ

మార్కెట్టు పరిస్థితులు తృప్తికరంగా యుండవు.

వెండి-బంగారాలు

మార్కెట్టు తేజీలోనే యుంటుంది.

వాటాలు

హెచ్చినప్పుడంతా అమ్మడమంచిది.

ధాన్యములు - ఆహారవస్తువులు

మిర్చి, తీపువస్తువులు (చక్కెర బెల్లం, మొ॥) నూనెలూ ఎక్కువ వెలలు కలిగి యుంటవి. పొట్టు ధాన్యములు కొంత తగ్గుతవి.

### రాశి ఫలాలు

**మేషం** (అశ్వని భరణి కృత్తిక 1వపాదం)

ఈ వారంలో 6 మధ్యాహ్నంలోపుగా ప్రయాణం కార్యానుసంధానంపై ఇతరులను కలువవలసియుంటే కలవడం ముగించండి. 7, 8 ల్లో ఆధారంలేని వార్తలకు ఎక్కువ ప్రాముఖ్యంఇచ్చి మనస్సును పాడుచేసుకుంటారు. కుటుంబ ఆర్థికపరిస్థితులు వ్యత్యస్తంగా యుంటవి. ఆరోగ్యంకూడా భిన్నగాయుండదు. 9, 10 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ నూతనయత్నం లాభకరం కాగలవు. 11, 12 ల్లో శ్రమ ఎక్కువ ఫలితం తక్కువ.

**వృషభం** (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర 1,2 పాదాలు)

ఈ వారపరిస్థితులు గతవారంలోకన్నా ప్రోత్సాహకరంగా యుండకలవు. 6, 7 ల్లో ఎదురుచూచేవారు రావడం శుభవార్తలు వినడం కలుగుతుంది. మిత్రులతో సమాజంలో సంతోషంతో కాలంగడుపుతారు. 8, 9 ల్లో కుటుంబ పరిస్థితులూ పిల్లల అనారోగ్యం ఎటూ కదలనివ్వవు. వారాంతంలో చర స్థిరాస్థి పరిష్కారాలు లాభకరం. వ్యాపారంలో లాభకరమైన పరిస్థితులు కలుగుతవి. పట్టుదలకలిగి వుడిపించుకొండి.

**మిథునం** (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు కొంత ఎదురుదెబ్బగా యుంటవి. శరీరానికి విశ్రాంతి-మనస్సునకు శాంతి అవసరం. 6 వ తేదీ మధ్యాహ్నంవరకూ అట్టే తేలికగా, అగపడిన వ్యవహారాలు పాటుంత్రానికి తల్లక్రిందులఅవుతవి. విపరీతయుగాని చిక్కు పెనవేసికుంటుంది. 7-8 ల్లో ఓర్పు అవసరం 9-10 ల్లో సద్దుబాట్లుకు అవకాశాలుకలుగుతవి. మిత్రులు సహాయం చేస్తారు. 12 కుటుంబంలో కలహం.

**కర్కాటకం** (పునర్వసు 4, పుష్యమి ఆశ్లేష)

ఈ వారంలో 6-12 ల్లో ప్రయాణం నూతనయత్నం లాభకరం కాగలదు. 7-8 ల్లో పరిష్కారాలకూ - వ్రాతల ముగింపులకూ అనుకూలం కలుగుతుంది. క్రొత్త వస్త్రాలూ-వస్తువులూ కొనడానికి బాగాయుంటుంది. 9-10-11 ల్లో ఆరోగ్యభంగం ఆశాభంగం కలుగుతుంది. వారాంతంలో ఆప్తులను కలుస్తారు. శుభ వర్తమానాలు వింటారు.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ఈ వారంలో క్రమేణా పరిస్థితులు అనుకూలంగా యుంటవి. 6, 7, 8 ల్లో ప్రయాణం. శుభసంప్రతింపులూ 9, 10, 11 ల్లో పరిష్కారాలూ, వ్రాతలూ కొనుగోలు విక్రయాలూ పెట్టుబడులూ లాభకరం. కొలవు మన్య కొన్ని ఆటంకాలు కలిగినా పట్టుదలలో కార్యక్రమం కూడా ముగించడం అవసరం. 12 ఆరోగ్యభంగం. వృధావ్యయం.

**కన్య** (ఉత్తర 2 3 4 పాదాలు, హస్త, చిత్త 1, 2 పాదాలు)

ఈ వారం ప్రథమంలో పరిస్థితులు అనుకున్నంత తేలికగా తెములవు. 12 మధ్యాహ్నంవరకు విఘ్నాలు ఎక్కువ. ప్రయాణభంగం కలుగుతుంది. 7, 8 ల్లో ఆరోగ్యం భిన్నగాయుండదు. మిత్రులు విసుగు కలిగిస్తారు. స్నేహ్యలేఖల్లో సబ్బతగులుతుంది 9, 10, 11, 12 ల్లో ప్రయాణ పరిష్కారాలు లాభకరం. త్వరపడి ముగించండి.

**తుల** (చిత్త 3, 4 పాదాలు. స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈవారంలో 9 ఉదయం వరకూ మీరు ఎంత ప్రయత్నించినా ఆరంభించి కార్యం సుముఖంగా-బాధకరంగా ముగియదు. ఆహారవిహారాలలో నియమం అవసరం. 9, 10, 11 ల్లో ఆరోగ్యంభంగం, సంఘవ్యవహారాల్లో వెనకపాటూ విసుగు కలుగుతుంది. వారాంతంలో ప్రయాణం; ఆప్తులను కలువడం, స్నేహ్యలేఖ, పేకాటలూ లాభకరం.

**వృశ్చికం** (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)

ఈవారంలో అపరిష్కారాలకు నూతనయత్నానికీ అనుకూలం. 7, 8 ల్లో తలపెట్టిన ప్రయాణానికి విఘ్నాలు కలుగుతవి. కాని ఎదురుచూచేవారు మీకొరకై వస్తారు. శుభసంప్రతింపులు నిర్విఘ్నంగా నెరవేరుతవి. 9 ఉదయంలోగా ముఖ్య కార్యక్రమం ముగించండి. 9, 10, 11 ల్లో ఆరోగ్యభంగం ఎక్కువ దేనినీ తలపెట్టి ప్రారంభించవద్దు.

**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం.)

ఈవారంలో 6, 7, 8 ల్లో మీరు తలపెట్టి ముగించలేనిదేమీయుండదు, సునిశితమైన ఆలోచనలు చేస్తారు. 9, 10, 11 ల్లో ప్రయాణం, వ్రాతలూ, వ్యవహారరీత్యా ఇతరులను కలవడం లాభకరం. 12 స్నేహ్యలేఖకు దూరంగా యుండండి. ఆరోగ్యంకూడా భిన్నగా యుండదు.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు)

ఈవారంలో 6 భోజనశయ్యా సౌఖ్యములు సమయానికి జరుగవు, ఉద్యోగనాశరీల్లో విసుగుకలుగుతుంది. 7, 8 ల్లో సంఘసామాజిక కార్యాలు విశ్రాంతి నివ్వవు. 9, 10, 11 ల్లో పరిష్కారాలూ, వ్రాతలూ, నూతన యత్నం లాభకరం. వారాంతంలో ప్రయాణం, ఆప్తులను కలవడం లాభకరం.

**కుంభం** (ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈ వారం పరిస్థితులు ఇంచుమించు గతవారంలో లాగేయుంటవి. 6 ప్రథమంలో ఆశాజనకంగా యుండే వ్యవహారాలు మధ్యాహ్నంనుండి వనుదిగుతవి. 7.8 ల్లో శ్రమ ఎక్కువ ఫలితం తక్కువ. 9.10.11 లో మిత్రులు విసుగుకలిగిస్తారు. ఇరుగు పొరుగుతో కలహాలు కలుగుతవి. వారాంతంలో వ్రాతలూ, పరిష్కారాలూ, లాభకరం.

**మీనం** (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ప్రస్తుతం గ్రహబలం మీకు బాగా యుంది. అవసరానికి శక్తికొలది విజృంభించి ముందుకుపోవడం. అవసరం. సమయంలో ముందుకు నెట్టగల మిత్రులుకూడా మీకు సహాయపడుతారు. 6.7.8 ల్లో పరిష్కారాలు, కోర్టు వ్యవహారాల రాజీలూ కొనగోలు విక్రయాలూ ముగించండి. 9.10 ల్లో శ్రమ ఎక్కువ ఫలితం తక్కువ. 12 ఆరోగ్యం భిన్నగా యుండదు.

## నోబిలు బహుమానం

### సాహిత్యంలో ఈ ఏడాదికి లేదట!

స్టాక్‌హోమ్, నవంబరు 3: ఈ సంవత్సరం సాహిత్యానికి నోబిల్ బహుమానం ఇవ్వబడదని తెలుస్తున్నది. ఈ బహుమానమును వచ్చే సంవత్సరానికి ఇస్తారట.

స్వీడన్ సాహిత్యసంఘం సాహిత్యంలో నోబిలుబహుమానం ఇవ్వడానికి అర్హులైనవారిని నిర్ణయిస్తుంది.

### ఫిజిక్స్‌లో జపానీయునికి నోబిలు బహుమానం

ఈ సంవత్సరం హిడెకియుకవా అనే జపానీయ విజ్ఞానవేత్తకు ఫిజిక్స్‌లో నోబెలు బహుమానం లభించింది. ఈయన వయస్సు 42 సంవత్సరాలు. ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలో ఈయన టోక్యో విశ్వ విద్యాలయంలో ఆచార్యులుగా ఉండేవారు.

ఈయన అణుశక్తి విషయంలో చేసిన శాస్త్రీయ పరిశోధనలవల్ల ఈ బహుమానం లభించినట్లు తెలుస్తున్నది.

ఈసంవత్సరంలో కెమిస్ట్రీలో నోబెలు బహుమానం కాలిఫోర్నియాలో రసాయన శాస్త్రాచార్యులుగా ఉంటున్న విలియమ్ ఫ్రాన్సిస్‌కి యూక్యుకవచ్చిందని ప్రకటించారు.

ఆల్ఫ్రెడ్ నోబెల్ అనే రసాయనశాస్త్రజ్ఞులు కొంత ధనంఇచ్చి 1896 లో ఈ బహుమానం ఏర్పరిచారు. ఈయన స్వీడన్ దేశస్థుడు. ఈ బహుమానధనం ప్రతీ సంవత్సరము మారుతూ ఉంటుంది అయినా బహుమానం దామాషాని 10 వేల పౌనులు ఉంటుందని తెలుస్తున్నది.

## నగరంలో సినిమాలు

| | |
|---|---|
| సాగర్, బ్రాడ్వే | 'బడీ బహెన్' |
| వెల్లింగ్టన్, ప్రభాత్ | 'అపూర్వ సహోదరగళ్' |
| గెయిటీ | "బ్రహ్మరథం" |
| పారగన్ | 'శైలానుబ్బా' |
| స్టార్ | 'సునేహ దిన్' |
| క్రౌన్, సన్ | 'మాయామచ్చీంద్ర' |
| సినిమా సెంట్రల్ | 'మోహిని' |
| సెలెక్టు | 'గుణసుందరి' |
| సరస్వతి | 'ఉత్తమ పుత్రన్' |
| Casino: | 'The Great Dan Patch' |
| Minerva: | 'Down Argentine Way' |
| New Elphinstone: | 'Mr. Belvedere goes to College' |
| New Globe: | 'Knock on any Door' |
| Roxy: | 'Caged Fury' |



సెలెక్టులో ప్రదర్శింపబడుతున్న 'గుణసుందరి'లో దులారీ.

### గుణసుందరి కథ

వాహినీ ప్రొడక్షన్సు తరఫున కె. రెడ్డి గారు తీసిన గుణసుందరి కథ డిసెంబరులో విడుదల అవుతుందని వార్త. గారు అప్పుడే పాతాళ భైరవి అనే కథ జానపదచిత్రం తీయడానికి సన్నాహం చేస్తున్నారు. ఈఫిలిముకు కూడా పింగళి నాగేంద్రరావుగారే పాటలూ మాటలూ వ్రాస్తున్నారు.

ఇదిట్లాఉండగా 'స్వర్గసీమ' అనంత స్టుడియో నిర్మాణంలోనే నిమగ్నమైన బి. ఎన్. రెడ్డిగారు 'మల్లేశ్వరి' అనే చిత్రానికి వ్యూహమయిన, ఫిలిం నిర్మాణానికి పూనుకొన్నారు. శ్రీకృష్ణదేవరాయలవారి కాలము సంబంధించినదట ఈగాధ. ఈసినిమాకు సాహిత్యం సముద్రాల వెంకటరాఘవాచార్యులు గారు సమకూర్చు తారు. మేటి ఫిలిం తీయడానికి వలసిన సన్నాహాలు జరుగుతున్నాయి.

### "చోటా బాయ్"

న్యూ థియేటర్సు వారి 'చోటాబాయ్' 11వ తేదీనుంచీ సాగర్‌లో విడుదల కానున్నది. ప్రఖ్యాత బెంగాలీ నవల రచయిత శరచ్చంద్ర ఛటర్జీ వ్రాసిన 'రామేర్ సుమతీ' నవల ఈ ఫిలింకు వృత్తం. ఈ నవలను శ్రీ వేలూరు రామశాస్త్రి గారు 'రాముని బుద్ధిమంతి' అని తెలుగులోకి తర్జుమా చేసియున్నారు కూడా.. ఈ ఫిల్మును కార్తీకఛటర్జీ డైరెక్టు చేశాడు. పంకజమల్లిక్ మ్యూజిక్ సమకూర్చారు. మోలినా, మహూర్, రాజ్యలక్ష్మి ప్రభృతులు నటించారు. పిల్లలందరూ చూడదగినచిత్రమని లోగడ కొన్నిరాష్ట్రాలలో ఈ ఫిలిమును వినోద పన్ను లేకుండా చేశారు.

### "నిషాన్"

అలెగ్జాండర్ డ్యూమాస్ వ్రాసిన 'కార్సికాన్ బ్రదర్స్' అనే నవలవృత్తంతో జెమినీ వారు తమిళంలో 'అపూర్వ సహోదరగళ్' అని, హిందీలో నిషాన్ అని ఫిల్ములు తీశారు. 'నిషాన్'లో భానుమతి, రంజన్ మాయావర్తి ప్రభృతులు నటించారు. ఎస్. ఎస్. వాసన్ డైరెక్టు చేశారు. ఈ ఫిలింప్రారంభానికే ఉత్తర హిందూస్థానంలో పలుచోట్ల విడుదల అయింది. ఈ నెలలోనే ఢిల్లీలో విడుదల అయింది. భారతరక్షణ మంత్రి సర్దార్ బలదేవ్ సింగ్ దీని ప్రదర్శనానికి అధ్యక్షత వహించారు. సివిల్ మిలిటరీ అధికారులు పలువురు హాజరైనారు. బల్‌దేవ్ సింగ్ ఫిలిమ్‌లా బాగుందని ప్రశంసించారు. వారి తరఫున జెమినీ ప్రచురణశాఖాధికారి కె. ఎన్. చారి ఆరోజు ప్రదర్శనపు గాబడి రూ. 2000/-లను కాశ్మీర్ పోరంలో పాల్గొన్న భారత సైనికులకు సౌఖ్యాల నిమిత్తం విరాళమిచ్చారు.

## ఫిలిం పరిశ్రమ యోగక్షేమాల రక్షణ

### రాయిబహదూర్ చునీలాల్ సూచనలు

భారత ఫిలింపరిశ్రమకౌవల ప్రభుత్వం వహిస్తున్న ధోరణి వాలా గర్హనీయంగా వున్నదనీ, ఈ పరిశ్రమ తొలిదశలోనే మూడవవంతు పైచిలుకు ప్రభుత్వం ఆదరం చేసుకొంటున్నా దీని అభివృద్ధికి ఏమీ తోడ్పడకపోవడంతో ఫిలిం పారిశ్రామికులను చాలచిన్నచూపు చూస్తున్నదనీ, కావున పరిశ్రమ యోగక్షేమాల రక్షణకు దేశంలోని వివిధ ప్రాంతాలలోని ఫిలిం వాణిజ్య సహాలు కలసి ఆలోచించుకొని ఒక సమాఖ్యను ఏర్పాటు చేసుకోవాలనీ ఇండియా మోషన్ పిక్చర్ సొసైటి అధ్యక్షుడు రాయిబహదూర్ చునీలాల్ 1 వ తేదీన దక్షిణభారత ఫిలిం వాణిజ్య సంఘ కార్యాలయంలో ఉపన్యసిస్తూ అన్నాడు.

చునీలాల్ భారత ఫిలింనిర్మాతలసంఘ అధ్యక్షుడు జె. బి. హోమ్. వాడియా, ప్రకాశ్ పిక్చర్స్ డైరెక్టరు విజయభట్, మైసూరు ఫిలిం వాణిజ్య సంఘాధ్యక్షుడు కె. ఎల్. భాటియా, ప్రకాశ్ పిక్చర్స్ వారి రాంబాణ్ అనే ఫిలింపై మద్రాస్ ప్రభుత్వం నిషేధం విధించిన సందర్భంలో ప్రభుత్వ అధికారులతో సంప్రతించుటకు గతవారం ఇక్కడికి వచ్చారు. వారి రాకను పురస్కరించుకొని ద. భా. ఫి. వా. సంఘాధ్యక్షుడు టి. ఆర్. సుందరం 1 వ తేదీని వారికి విందుచేశారు. ఆ సందర్భంలోనే చునీలాల్ పై అభిప్రాయం వెలిబుచ్చారు.

ద. భా. ఫి. వా. సంఘ ఉపాధ్యక్షుడు రామయ్యగారి అభివందనలతో కార్యక్రమం ముగిసింది.

## సంపాదక లేఖలు

### ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు: చెన్నపట్నం సమస్య

#### ఇరువురు పట్నవాసుల సూచనలు

చెన్నపట్నం, నవంబరు 5: శ్రీ వారణాసి వెంకటచలంగారు ఇట్లు వ్రాసిరి:

"ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై కాంగ్రెసు కార్యవర్గం ఒక నిర్ణయానికి వచ్చింది. జె.వి.పి. రిపోర్టును కార్యవర్గము భారత ప్రభుత్వంకూడ ఆమోదించిరి.

ఇటుపైన కేంద్రప్రభుత్వంగాని, ఆ కేంద్రప్రభుత్వంను నడిపే నాయకులుగాని, యీ రాష్ట్రనిర్మాణం విషయంలో సుముఖులుగా లేరనిగాని, పక్షపాతబుద్ధి చూపుచున్నారని గాని అనడం సమంజసము గాదు.

జె. వి. పి. రిపోర్టుప్రకారం ఈ నాటికి ఆంధ్రరాష్ట్రం లభించు సూచన కనబడుచున్నది. ఇప్పటికైన ఆంధ్రులందరూ ఏకమై జె. వి. పి. రిపోర్టును ఒప్పుకొని వెంటనే ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణానికి అవసరమైన అనుకూల పరిస్థితులను ఏర్పాటు చేసెదరని విశ్వసిస్తూ వున్నాను. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు యీ విషయమై సరియైన సలహాను రాష్ట్రప్రజలకిచ్చి, వారి సంపూర్ణ విశ్వాసమును పొందెదరు గాక.

ఈ విషయ నిర్ణయం ఆంధ్రులు, తమిళులు, మహారాష్ట్రులు, కన్నడులు, కేరళులు, తదితర వివిధభాషా ప్రాంతీయులు ఎల్లరును గమనించవలసిన దొకటున్నది. భారతవర్ష మంతటిలో సభ్యత ఒకటే. ప్రతివ్యక్తి ముందు భారతీయుడు. అని గ్రహించవలయును. ఆటుపైననే ఆంధ్రులు, తమిళులు, కన్నడులు ఇత్యాదులు అగుదురు. వివిధభాషల ననుసరించిన ప్రత్యేకరాష్ట్రములు ఏర్పరచడం, భారతదేశాన్ని సంపూర్ణమైన ప్రజాస్వామికంగా చేయడంకొరకేనని ఎల్లరు గ్రహించవలసియున్నది.

రాష్ట్రములు తమ తమ ప్రభుత్వనిర్వహణంలో ఎంత స్వతంత్రములైనప్పటికి, భారతదేశములోని భాగములే అయియున్నవి. అట్లే వివిధ రాష్ట్రాలుకూడ భారతదేశప్రజలే.

అందువలన యీ ఆంధ్ర తమిళ రాష్ట్ర నూతన నిర్మాణంవల్ల, ఉభయరాష్ట్ర ప్రజల మధ్య సోదరభావము ఉండియే తీరును. భేదాభిప్రాయాలు లేక ఒండొరులలో సోదరభావము కలిగియుందురు గాక.

### పట్నాన్ని విభజించరాదు

శ్రీ కె. పి. రాజయ్యగారు నాయుడు గారిట్లు వ్రాసిరి: చెన్నపట్నంలో అరవవారు కౌరవులుగాను, ఆంధ్రులు పాండవులుగాను ఉన్నారు. ఈ పాండవులు మహాభారతమందలి పంచపాండవులవలెనే సమస్తకష్టనిష్ఠూరములను ఓర్పుతో సహించి కాలం గడపవలెను. ఈ సందర్భంలో ఆంధ్రమంత్రులు, పట్నంలోని కొందరాంధ్రప్రముఖులు కుంతీపుత్రుడైనా కౌరవపక్షం వహించి తనవారిపై కత్తిగట్టిన కర్ణు నిస్థితిలో నున్నారు.

ఏమైనా, చెన్నపట్టణమును విభజించరాదు. ఇంతవరకూ ఉన్నట్లే అరవం, తెలుగు, మలయాళం, తుళు, కన్నడం మొదలగు భాషలవారి కందరికిని ఈపట్టణం స్థానమై ఉండవలెను.

### చేనేత పారిశ్రామికుల గోడు

అక్టోబరు 27, 28 తేదీలలోవచ్చిన తుఫానువల్ల "మంగళగిరి, తాడేపల్లి, ఆత్మకూరు, కాజ" వగైరా గ్రామములలో చేనేతపరిశ్రమకు విపరీతమైన నష్టం వాటిల్లినది. మగ్గాలు, అచ్చులు తదితర పరికరములు యావత్తు ధ్వంసం అయినవి. వీరికి ప్రస్తుతం తినతిండి, వుండుటకుయిల్లు లేక నానా అవస్థలు పడుచున్నారు. గనుక ప్రజాప్రతినిధులు, ప్రజానాయకులు, ఉదారభావముగలవారైన తదితరులు ప్రభుత్వమువారు యీ పారిశ్రామికులకు కావలసినమగ్గం వగైరా పరికరములు ఖరీదు చేసుకొనగలందులకు, వుండుటకుయిల్లు వేసుకొనగలందులకు, ప్రత్యేకముగా "చేనేత" వారికి కొంతవిరాళము కేటాయించ కోరుచాము.

ఇట్లు,
గోలి సీతారామస్వామి,
మంగళగిరి.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 5:

బంగారం - వెండి చేటీ మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-8 ఎక్కువ బొమ్మ సీల్బాలున్నపుటోన్ రు.78-12-0 చేటి బంగారం తులం 115-0-0 పూర్వరూకాకా 112-14-0 మీలుబండి తులం 100-8 (రెడీ) 169-0-0 వెండి తులం 1 కి 1-12-0

వేరుసెనగ: (581 పా 1-8 ఎక్కు [illegible]) [illegible] బజారు ధర రు. 153-0-0 [illegible] రు. 350-0-0 నవంబరు ఆండ్ డిసెంబరు రు. 315-0-0 (3% టు 5% ఎక్. ఎక్. ఎ.) కందిపప్పు (87 పౌండ్లు) [illegible] రు. 33-12-9, [illegible] 35-8-9 పెంచారు.

ఆముదం

కొండ 500 పౌనులుగలది రు. 293టు295

పంచదార

పార్లరీ (2 అంకము) రు.91-14-6 చక్కెర [illegible] వీశ 1-8 1-4-9

న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 4: అక్టోబరు వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| చేటి ప్రారంభం | వల | 31.02 |
| నిన్న | | 29.99 |
| ,, ముగింపు | వల | 30.12 |
| నిన్న | | 29.99 |

# విచ్ఛిన్న విభ్రాంతి

## 4

[ఫ్రైడా ఊట్లేవిరచితమైన "విచ్ఛిన్నవిభ్రాంతి"యను గ్రంథము లోని నాల్గవ అధ్యాయ సంగ్రహ మిది. "సర్కారు ఉత్తరువు ప్రకారంగా సమష్టి ఉత్పత్తి" విధానమును స్టాలిను అమలుపరచుటలో ఎటువంటి క్రూరపిశాచతాండవకాండ జరిగెనో "కులాకు"లను ఏవిధముగా రద్దుచేయించెనో ఈ అధ్యాయములో వివరింపబడెను.]

# సోవియట్ రష్యా నిజస్వరూపం

రచన: ఫ్రైడా ఊట్లే

చెప్పేనున్నా చేసిన్నా త్వరగానే నేర్చుకొన గల్గితిమి. వ్యవసాయమునంతను సమష్టి కృషిగా సాగించుటకై నిర్ణయింపబడిన పంచవర్ష ప్రణాళికను నాలుగు సంవత్సరములలోనే ముగించుట యను విషయము. లండనులోని బూర్జువావర్గముల వారు అంతు పొంతు లేకుండా సుఖంగా తమ పార్టీ మీటింగులయందు రాద్ధాంత సిద్ధాంతములు చేసి చర్చ చేయుచుందురు. కాని అది యంతయును ఫస్కు చర్చావసరలో మాత్రములేను. ఈ వ్యవహార మంతయును మా నిత్యకృత్య జీవితమునకును, మా చుట్టుప్రక్కల నుండెడి ప్రజల జీవితమునకును సంబంధించిన సహింపరాని ప్రత్యక్షావస్థలుగా పరిణమించినవి. ఈ వ్యవహార పథకము మూలంగా చాలామందికి కుడువ కూడు లేకుండాపోయింది. అత్యధిక సంఖ్యాకులకు యించుమించుగా కాటక మేర్పడింది.

సమష్టి వ్యవసాయం, పారిశ్రామికాభివృద్ధి యనెడి పథకం మూలంగా ప్రజాసామాన్యంతో సంబంధం విడిపోయినటువంటి ఒక ప్రత్యేక గౌరవ హోదాగల గొప్ప తరగతివారు సంఘంలో ఏర్పడిరి. పూర్వకాలపు ఫ్రాన్సులో సామంతులనే వారు కొందరు జీవితహోదాల వ్యత్యాసములను బట్టి ఏర్పడినట్లుగా యిప్పు డిక్కడ కూడా ఏర్పడెరి.

రష్యాలో కాటక మెందుకు ఏర్పడిందో "కులాకుల"ను రద్దు చేయుటకు ఏ పరిస్థితులు కారణభూతమైనవో తిన్నూలంగా ఎటువంటి క్రూరకాండ జరిగినదో, దేశము యొక్క ఆర్థిక వ్యవస్థ ఏ విధంగా తారుమారైనదో కూడు తెలియును. 1927 సం॥ 1928 సం॥ లో రష్యానుగూర్చి నాకు రష్యాను గూర్చి మొట్టమొదటి భ్రమలు అసత్యభావములు కొన్ని కలిగినప్పటికీ, ఆర్థిక రాజకీయ విషమస్థితి రష్యాలో ఏర్పడింది.

క్రయివేటు ఆసాముల స్వతంత్ర పెట్టుబడి వ్యాపారమును కొంత పరిమితివరకే సాగనిచ్చుచుండినటువంటి నూతన ఆర్థిక విధానము దేశానికి కొంత సుభిక్షదాయకమయ్యెను కాని, యీ ఆర్థిక విధానమును స్టాలిను సమాప్తమొందించెను. ఈనూతన ఆర్థిక విధానమే రష్యాలో ధనికవర్గము తిరిగి ఏర్పడుటకు కారణభూతమయ్యెను."

1926 సం॥లో రష్యాయందు కులాకులనబడే రైతులు కొందరు ఉండేవారు. దేశ మొత్తములోని రైతాంగమునందు వీరు నూటికి అరిరోపంటుగ ఉండేవారు. కాని, దేశములోనుండిన పంటలో మూడింట రెండువంతులు ధాన్యం వీరి చేతిమీదుగానే అమ్మబడుతూ ఉండేది. ఈ కులాకులనెడి రైతులు తమ ధాన్యమును మధ్యవేరగాండ్లకు అమ్ముచుండేవారు. ఇందు మూలంగా ఒక "చోటా బూర్జువాదుకాణాదారులు, హోటళ్ల ఖామందులు, కొద్దిపాటి పారిశ్రామికులు వానకురిస్తే మొలిచిన కుక్కగొడుగులవలె" అంకురించారు.

సోవియటు రష్యను ప్రభుత్వపు కంట్రోలు అనికారమును తప్పించుకొని రైతులు తమనుట్టుకు తమకు స్వల్ప పోషకమైన ఆస్తిని ఏర్పాటు చేసికొనుచుండిరి. ఈ దేశంలో ఏ విధమైన వ్యవహార విధానమును అనుసరించవలెనను విషయమై బోల్షివిక్కుపార్టీలో వామపక్ష, దక్షిణపక్షములకుమధ్య (అనగా తీవ్రవాదుల మితవాదులమధ్య) కలిగిన అభిప్రాయభేదములు కలవు. కాని, వారిలో వారు ప్రభుత్వాధికార పదవులను సంపాదించవలెననే ప్రాకులాటలో వారి అభిప్రాయభేదాలు పెడత్రోవల త్రొక్కినవి.

స్టాలినుకు శాస్త్ర విషయకమైన సిద్ధాంత పరిజ్ఞానము హీనము-ఏదైన ఒక వ్యవహార విధానముయొక్క ధర్మాధర్మ విమర్శలో స్టాలినుకు యీమధ్యాత్మమైనను ప్రసక్తి లేదు. అతనికి కావలసినది నిరంకుశాధికారం - అందుకొరకై ట్రాట్స్కీని అణగద్రొక్కి వేసినాడు. దక్షిణ పక్షముయొక్క సహాయంతోను బుఖారిన్ సహాయంతోను వామపక్షంలోని ప్రతికూల కక్షను అంతమొందించాడు.— అటుపిమ్మట ట్రాట్స్కీకంటెను ఎక్కువ తీవ్రమైన వామపక్ష విధానమును అతడు అవలంబించి దక్షిణ పక్షంలోని తన ప్రతికూలురను రూపుమాపెను. అంత్యపర్యవసాన మేమనగా, అటు వామపక్షము యొక్క నికృష్ట లక్షణములును, ఇటు దక్షిణపక్షముయొక్క నికృష్ట లక్షణములను స్టాలిను తనపార్టీకి కర్తవ్యంగా అనుసరించెను.

రైతులు ఎవరికివారే తమ భూములను విడి విడిగా సాగుచేయుట మంచిదనియు, గ్రామస్థులందరు సమష్టిగా వ్యవసాయం చేయవలెననుట తప్పు పద్ధతియనియు స్టాలిను 1928 సం॥ జూలైలో వాదించి యుండెను. కాని ఆ సంవత్సరము అక్టోబరు మాసంలోనే స్టాలిను తన తత్వం తలక్రిందులుగా మార్చుకున్నాడు. బుఖారిన్, రైకోవ్, టామ్స్కీగార్లు ధనికవర్గమును పునరుద్ధరించు గోరుచున్న బూర్జువామితవాదులని వారిని నిందించెను. పరిశ్రమల ప్రభుత్వ నిర్వహణ విధానమును, సంపూర్ణమైన సమష్టి వ్యవసాయపద్ధతిని, కులాకులను రద్దుచేయుటకొక కార్యక్రమమును రైతాంగము నంతను క్రూర కిరాతక నిర్బంధ విధానములో పని చేయించుటకును స్టాలిను సంకల్పించి అందుకొక సాహసోపేతమైన వ్యవహార పథకమును ఉపక్రమించుటకు సంసిద్ధుడయ్యెను. రష్యాలోకెల్ల సకల సౌకర్యాస్పదమైన మాస్కో నగరంలోనే 1928 సం॥ డిసెంబరు మాసములో ఆహార పదార్థాలకొరత కన్పింపసాగెను.

రైతులు తమవద్ద నుండిన ధాన్యమును దాచుకొన్నారు. తమవద్ద ఉన్న గింజలను నాటుటకు నిరాకరించిరి. తమ పంటను వశపరచుకొన్న పెద్ద అధికారులను ఖూనీ చేయుచుండిరి.

రైతులను నిర్బంధించుటగాని బెదరించుటగాని ఎంతమాత్రము సాధ్యమయ్యే పనిగాలేదు. ఫ్యాక్టరీలలోని పనివాండ్లందరిని ఒక్కటేమురాగా పని చేయించినట్లుగా రైతులనుకూడా ఏకంగా పని చేయిస్తేనేతప్ప మరొక సాధనోపాయం కన్పించలేదు. అందువల్ల సమష్టి-వ్యవసాయ పద్ధతినే అమలు పరచవలెనని ఉత్తరువు జారీ చేయబడెను. పేద రైతులకు ప్రభుత్వము వారే స్వల్ప ఋణములను ఇచ్చి ప్రోత్సహించుటవల్లను వ్యవసాయ యంత్రములనిచ్చి సహాయము చేయుట వల్లను ప్రత్యేక ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రములందు కంటె, యీ పేదరైతులే ఎక్కువ పండించుచు తమలోతాము పరస్పరంగా తమ సాధన సంపత్తిని అయిచ్చికంగా సమకూర్చుకొనుచుండిరి. ఈ పద్ధతి ఇదివరలో ట్రాట్స్కీ అనుసరించిన పద్ధతి ఇది. కాని, స్టాలిను యిప్పుడు అవలంబించిన సమష్టిపద్ధతి అదికాదు. రైతులనందరినీ ఏక జట్టుగా కలిసి పని చేయించడమే స్టాలిను అనుసరించిన పద్ధతి.

స్వతంత్ర ప్రయివేటు ఆసాముల వ్యవసాయ పద్ధతి అంతమొందింపబడినట్లుగా 1929 సం॥ నవంబరులో స్టాలిను ప్రకటించెను. కులాకులనే తరగతి రైతులు (అనగా సొంతభూమిగల ఆసాములనేవారు) ఉండకూడదని ఉత్తరువు చేసెను, సమష్టి వ్యవసాయ క్షేత్రములను ప్రతి గ్రామములోను ఏర్పాటు చేయవలెననియు ప్రతిరైతును అట్టి సమష్టి వ్యవసాయ కూటములందు చేర్చవలెననియు ఉత్తరువు చేసెను.

సోషలిస్టు తత్వంప్రకారంగా వ్యవసాయసమస్యను పరిష్కరించు నిమిత్తమై ప్రాజ్ఞవ్యయును భయానక దండనవిధానములను అవలంబించుటకు స్టాలిను నిశ్చయించెను.

అటుపిమ్మట కులాకులను తండోపతండములుగా రష్యనుప్రభుత్వం హత్యచేసినది. అంత దారుణక్రూరకృత్యము ప్రపంచచరిత్రలో మరొకటి కన్పింపదు. హత్యచేసెననేమాట నేను ఈ సందర్భంలో బుద్ధిపూర్వకంగానే ఉపయోగించితిని. కులాకులను వరుసలుగా నిలువబెట్టి తుపాకులతో కాల్చివేయకపోయినప్పటికీ, అంతకంటె ఎక్కువక్రూరంగానే వారు చంపివేయబడిరి.

వారిలో ప్రాణగండంతప్పి బ్రతికి బట్టగట్టినవారు కొందరుకలరు. వారిని ఏ మరుభూములలోనికి ప్రవాసమునకై బహిష్కరించిరో ఆ మరు భూములలోనే వారు తిరిగి జీవనోపాధిసాధనములను చూచుకొనిరి. స్త్రీలు పిల్లలుమాత్రము నాశనమైనారు. లక్షలకొలది రైతులను మందలు మందలుగా ఉత్తర ధ్రువప్రాంతములలోని కొయ్యకైదుల ప్రవాసమునకు తరిమివేసిరి అక్కడ ఆకలితోమాడి, చలికి బలియై, ప్రాణాలుపోల్చివేసే కఠినకాయకష్టంచేస్తూ అచటి రష్యనుభటులచే కొరడాదెబ్బలుతింటూ ఉండేవారు. పురాతనకాలములో ఫురోచక్రవర్తి తన దానిసలను హింసించినట్లుగానో ఏ అసియాఖండ నిరంకుశ క్రూరచక్రవర్తి ప్రజలను పీడించినవిధంగానో వారు పీడింపబడిరి.

ఏ రైతుల భూములను ప్రభుత్వము దఖలుపరచుకొనెనో ఆ ట్టి తిండిలేని విషాదపూరితులగు రైతులుఎప్పుడైనను తలయెత్తి పగసాధింప ప్రతిఘటింతురేమో అనేభయంచేత, పీడితరైతులను పూర్తిగా నిర్మూలించవలెనని కమ్యూనిస్టుపార్టీ సంకల్పించెను. అందువల్ల గ్రామసీమలందంతటను కిరాతకమైన హింసాకాండ తాండవమాడెను.

ఈ అమాయకులైన నిరపరాధులను ఆగలిమంటలతో తుపాకీకాల్పులతో రాక్షసంగా సంహరించిన సందర్భములో అనేక సంకల్పకారణములు తోడ్పడి పని చేసెను. మతావేశం, ప్రతీకారభయం, యూదీయవిద్వేషము, పూర్వపగసాధింపు మొదలైనవి కలిసి పనిచేసెను. రష్యను గ్రామాలలో పూర్వపు కలహములను జ్ఞాపకముంచుకొనిన యూదులున్నా, జారుచక్రవర్తుల కాలములో కొస్సాకు భటులచే కొరడాదెబ్బలు తినినటువంటి కార్మికులున్నా, ఇప్పుడు ధనికనిర్ధనికవర్గ విభేధనిర్మూలనకై ధర్మసమరము సాగించుచున్నామనెడి మిషతో తమ పూర్వ విద్వేష విషయములను వెడలగ్రక్కిరి.

కమ్యూనిస్టుపార్టీ జారీచేసిన ఉత్తరువులను పురస్కరించుకొని, రైతులకుగల స్వల్ప నిల్వధాన్యమునుకూడా లాగుకొని కొల్లగొట్టుటమూలంగా సోషలిస్టు తత్వానుసారమైన నూతన సాంఘికవ్యవస్థను తాము నిర్మించుచున్నామనెడి నమ్మకముతో ఆవేశపూరితులైన యువకులు, యువతులు సరస స్వభావులయ్యును వారిబుద్ధులు పెడత్రోవలబట్టెను.

కేవలం కులాకులనుమాత్రమే (సొంత భూముల ఆసాములను మాత్రమే) ఆస్తివిరహితులనుచేసి, దేశబహిష్కృతుల నొనర్చి కారాగార నిబద్ధులను చేయలేదు. సమష్టి వ్యవసాయము అంటే, సొంతభూములు కలవారి భూములను సర్కారుకు దఖలు పరచుకొనుటయే యగునని భూమిగల ఆసాములందరు గ్రహించిరి. భూములు లేని కొలదిమంది రైతులుతప్ప అందరూ ఆ రీతిగానే గ్రహించిరి ఆయా రైతులకు ఉన్నటువంటి యావదాస్తిని సొత్తును సమష్టి వ్యవసాయసంస్థకు ఒప్పగించవలెనని ప్రభుత్వము ఉత్తరువుచేసింది. ఆ రీతిగా ఒప్పగించనియెడల, సైబీరియా ఎడారులలోనికి బహిష్కరింప బడుదురు. లేదా కఠిన వరకపు ప్రవాసములలో బానిసలవలె పాటుపడవలెను. ఈవిధంగా వారిని ప్రభుత్వము బెదరించుటవల్ల రైతులు సహజంగా తమవద్దనున్న పందులను గొర్రెలను, ఆవులను, తమ కోడిపిల్లలనుచంపి తినివేసిరి. లేదా వాటి మాంసమును చర్మములను అమ్ముకొని, దాచుకో గల్గినంత పైకమును దాచుకొన్నారు. రష్యాలో 1929 సంవత్సరమందు ఉన్నటువంటి సంఖ్యలో సగముమాత్రమే 1934 సంవత్సరములో కలవు. ఇక పందులు గొర్రెలుమాత్రే సగంకంటె తక్కువగా ఉన్నాయి.

రైతులను ఎట్లాగైన యీ సమష్టి వ్యవసాయ సంస్థలలో చేర్పించినయెడల, రష్యాలో ఆహారసమస్య పరిష్కరింపబడినట్లగునని నేను మాస్కోనగరమందు మకాముచేసిన మొదటి సంవత్సరములో తలంచుచుండెడివారు. 1931 సం॥నాటికి వ్యవసాయ భూములన్నియు చాలవరకు సమష్టి వ్యవసాయసంస్థల స్వాధీనమైనప్పటికి, దేశ క్షేమలాభముకొరకై కృషిచేయుటకు రైతులను నిర్బంధించుట జరుగలేదు.

వారికి స్వతంత్ర ప్రేరేపణలేదు. ఎందుచేతననగా, వారికి సొంత భూమి అనేది లేదు. ప్రభుత్వమువారే ఫ్యాక్టరీలను స్వాధీనపరచుకొని, యంత్రాగారములద్వారా చేయవలసిన వస్తూత్పత్తిని చేయుచుండుటవల్ల ప్రజావినియోగార్థమైన సరకులను వెనుక అమ్మకమైనంతగా యిప్పుడు గవర్నమెంటు అమ్మవలసిన అగత్యంలేదు గనుకను, ధాన్యమును, నామమాత్రమైన స్వల్ప కిమ్మతుకు సర్కారు స్వాధీనము చేసికొనుచుండినందువల్లను యీ సమష్టి సంస్థలలోని రైతులు పూర్వముకంటె తక్కువ శ్రద్ధతో తక్కువ శ్రమపడుచుండిరి.

పూర్వము వర్తింపజేయబడిన నూతనార్థిక విధానమును ఎటువంటి సాత్విక నిరోధముతో ప్రతిఘటించిరో ఇప్పుడు కూడా అటువంటి సాత్విక నిరోధముతోనే ప్రభుత్వమును ప్రతిఘటించిరి. తమ భుక్తికి కావలసినంత మేరచేసె పండించిరి దీనికితోడు నల్లరేగడ ప్రాంతములో వాన లేమివల్ల పంటలు పాడైచుండును. యీ రెండు కారణములవల్లను పూర్వ సంవత్సరములందుకంటె రష్యాలో పంట తగ్గిపోయెను. అట్లయినప్పటికీ, గవర్నమెంటుకు వసూలు కావలసిన పూర్తి ధాన్యమును గ్రామాలనుండి వసూలు చేయవలెనని నిర్బంధించుచుండిరి. గ్రామాలలోని రైతులు తినుటకు చాలినంత ధాన్యం మిగలకపోతే, అది అంతా వారి తప్పిదమే అని చెప్పి, వారిని ఆకలితో మాడవలసినదన్నారు.

బాగా సస్యశ్యామలంగా పంటలుపండే యూక్రేనువంటి ప్రాంతములోనే దారుణమైన కరువు ఆరంభమైనది రష్యాను చూచుటకు ఎవరైనా విదేశీయులు వస్తే, వారివెంట ఉండే యాత్రా వ్యాదర్శకులు ఆ విదేశీయులను ఆ కరువు ప్రాంతంలోనే దివ్యమైన హోటళ్ళలోనికి తీసికొనివెళ్ళి భోజనములు పెట్టించేడివారు. అందువల్ల యీ విదేశీయులు తమ దేశాలకు వెళ్ళినప్పుడు రష్యాలో కరవు లేదని చాటించేవారు.

స్టాలినుయొక్క సంపూర్ణ నిరంకుశత్వ మేమిటో నగ్నంది. రైతులు సాగించిన ప్రతిఘటన వ్యర్థమైనది. ఆయా గ్రామాల నుండి ప్రభుత్వమునకు వసూలు కావలసిన ధాన్యము మాత్రమే గాక, గ్రామంలోని జనానికి కావలసిన ధాన్యమును కూడా పండించినచో తప్ప తాము తిండిలేక మాడవలసి వచ్చునని 1932 సం॥ నుండియు రైతులు గ్రహించిరి. ప్రభుత్వం నిర్ణయించిన వరకు పద్ధతుల ననుసరించియే వారు కృషిచేయుటకు నిర్బంధింపబడిరి. అనిష్టంగా గ్రామాలలోని ప్రజలు ప్రభుత్వానికి తిరిగి బానిసలైరి. ఈ సమష్టి వ్యవసాయ సంస్థలయందు యీ రైతులు నిర్బంధితులై కష్టించుచున్నారు. పూర్వకాలపు మధ్యయుగములందు సామంత ప్రభువు క్రింద బానిసలు చేసిన నిర్బంధ సేవవంటిదే యీ సమష్టి వ్యవసాయ సంస్థలలోని రైతుల కాయకష్టము.

## ఇంటి పెత్తనం

ముష్టివేస్తే అత్తగారు తిడుతుంది వెళ్లబ్బీ!

ముష్టివాణ్ణి పొమ్మనటానికి యీ యింట్లో నీ కేమిటి అధికారం ?

ఒరే! అబ్బీ! ఇలారా!

పెళ్లమనటానికీ ఉండమనటానికీ నాకొడలికి అధికారంలేదు – చెయ్యి ఊరుకో లేదు ఇక వెళ్లు.





ఢిల్లీలో జరిగిన సుగ్రపు పందాలలో "సైనాక్" అనే అశ్వం విజయాన్ని పొందింది. పందెంలో, ఆ గుర్రంపైన స్వారీచేసిన అశ్వారోహకుడు యస్. ఛాన్సనాకి గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు రజతపాత్రను బహూకరిస్తున్నదృశ్యం.

## ప్రభుత్వ కార్యాలయాల్లో ఖద్దరువాడకం

### డిపార్టుమెంట్లకు ప్రభుత్వ తాఖీదు

మదరాసు, నవంబరు 4: ఖద్దరు విధానము ననుసరించి ప్రభుత్వ కార్యాలయములలో సర్వవిధములా ఖద్దరు వాడుకను ప్రోత్సహించుటయే ప్రభుత్వ ఉద్దేశ్యమని ప్రభుత్వ కార్యాలయ శాఖాధిపతులకు, కలెక్టర్లకు వుత్తరువు జారీచేయబడెను.

ప్రభుత్వ వుత్తర్వుల అంతరార్థము గ్రహించకపోవుటవలన ఖద్దరు వాడకము నుండి మినహాయింపు ఇవ్వగోరుచు కొన్ని శాఖలనుండి దరఖాస్తులు అందుచున్నవని సదరువుత్తర్వులో తెలియజేసిరి.

ఖద్దరువాడుటకు వీలుకాని సందర్భములలో తప్ప ఖద్దరువాడకమునుండి మినహాయింపు ఇవ్వకూడదని ప్రభుత్వం నిశ్చయముగా అభిప్రాయపడుచున్నదని తెలిపిరి.

ఖద్దరున్నికగురించి, ఖరీదుగురించి ప్రభుత్వం పరిశీలించియున్నది. అందువలన ఈ కారణములపై మినహాయింపు దరఖాస్తులు స్వీకరించబడవు. ప్రభుత్వ శాఖలు ప్రభుత్వఖద్దరువిధానమును అమలు జరుపుటకు మనఃస్ఫూర్తిగా పూనుకొనవలెనని ఆ వుత్తర్వులో ప్రభుత్వం ఆదేశించినది.

## చేనేత పరిశ్రమకు ప్రోత్సాహం

మదరాసు, నవంబరు 4: ఇండియా ప్రభుత్వము వారు వాడువస్త్రములలో 3 వ వంతు చేనేత వస్త్రములనే వాడవలెనని నిర్ణయించిరి.

ఈ విషయమును విలేఖరులకు వెల్లడించుచూ పరిశ్రమలమంత్రి శ్రీ పెరుమాళ్ స్వామిరెడ్డిగారు చేనేత వస్త్రముల రవాణాఛార్జీలను నూటికి 50 వంతులకు తగ్గించుటకు రైల్వేబోర్డు అంగీకరించినదనికూడ తెలిపిరి.

చెన్నరాజధానిలో సంవత్సరమునకు షుమారు రు 2 కోట్ల విలువగల 29400 బేళ్ల చేనేత వస్త్రము వుత్పత్తి యగుచున్నది. ఇండియా ప్రభుత్వ నిర్ణయము ననుసరించి షుమారు కోటిరూపాయల చేనేత వస్త్రము వాడెదరు. ఇందులో షుమారు రు 50 లక్షల విలువ వస్త్రమును మదరాసు నుండి తీయవచ్చును. ఇందువలన చేనేత వారికి కొంతవరకు సహాయము లభించగలదని ఆశించుచున్నారు.

ఇదీ గాక చేనేత వస్త్రములకు పోటీగావుండు మిల్లువస్త్రములను దిగుమతి చేసుకొను విషయములో ఇండియా ప్రభుత్వము రాష్ట్రప్రభుత్వమునకు స్వేచ్ఛ ఇచ్చినట్లు కూడా పరిశ్రమల మంత్రి తెలిపిరి.

## ఉద్యోగ వార్తలు

మదరాసు, నవంబరు 4: శ్రీ ఎ. పీ రాజు కర్నూలుజిల్లా విద్యాధికారిగనూ, డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు శ్రీ జి. కామేశం తాత్కాలికముగా దక్షిణ విశాఖజిల్లా విద్యాధికారిగా నియమించబడిరి.

శ్రీమతి యస్. స్టీఫెన్ విశాఖపట్నం క్వీన్‌మేరీ గవర్నమెంటు సెకండరీ ట్రయినింగ్ స్కూలు సూపరింటెండెంటుగ తాత్కాలికముగ నియమించబడిరి.

## మధ్యరాష్ట్రాలలో బియ్యం ధాన్యం ధరల తగ్గింపు

నాగపూర్, నవంబరు 3: ఈ వేళ మధ్య రాష్ట్రప్రభుత్వం బియ్యం, ధాన్యం ధరలలో సుమారు నూటికి 3 వంతులు తగ్గిస్తూ ఒక ప్రకటన చేసింది. ఇది భారత ప్రభుత్వం ధరలు తగ్గించవలసిందని చేసిన సూచనకు ఫలితంగా జరిగినదని తెలుస్తున్నది.

## స్వదేశ నౌకబలం ప్రాధాన్యం

### అంతర్జాతీయ నౌకాయాన మహాసభలో చర్చ

లండన్, నవంబర్ 3: విదేశాలతో వాణిజ్య ఒడంబడికలను చేసుకుంటున్న స్వతంత్ర ఇండియా మొదలైన దేశాలు అనేకులు తమ దేశపు నౌకలద్వారానే సరుకులను పంపాలన్న పట్టు పడుతున్నవి. ఈ పరతులలో వివక్షత అనేది ఉన్నదా లేదా అన్న విషయమై నవంబర్ 8, 9 తారీఖుల్లో ఇక్కడ జరగబోతున్న అంతర్జాతీయ నౌకాయానమహాసభ చర్చించబోతున్నది. ఇండియన్ నేషనల్ స్టీంషిప్స్ కంపెనీస్ ఎసోసియేషన్ ప్రతినిధిగా ఎం. ఎ. మాస్టర్ ఈసమావేశంలో పాల్గొంటున్నారు.

కొన్నికొన్ని దేశాలు తమ రేవులకు వచ్చి నౌకలపై రాబడిపన్ను వేయటం, సూయజ్ కాలువ అధికారులు టోల్‌గేట్ చార్జీలను పెంచటం, ఓడల టన్నేజి కొలతలు మొదలైన ముఖ్యాంశాలను సరించికూడా మహాసభ చర్చిస్తుంది.

## దేశంలో 1073 కోట్ల నోట్లు చలామణి

### రిజర్వుబ్యాంక్ ప్రకటన

బొంబాయి, నవంబరు 3: అక్టోబర్ 28 వ తేదీతో అంతమయ్యే వారంలో దేశంలో చలామణీయందున్న నోట్లు 5.59 కోట్ల రూ. ల వరకు తగ్గినవని రిజర్వు బ్యాంక్ నోట్లను జారీచేసే డిపార్టుమెంటు వారు ప్రకటించారు.

బ్యాంకింగ్ డిపార్టుమెంటులో డిపాజిట్‌లో ఉన్న నోట్లసంఖ్య 6 కోట్లు పెరిగింది. ప్రభుత్వ డిపాజిట్లు 2.59 కోట్లు. బ్యాంకుల డిపాజిట్లు 5.25 కోట్ల రూ. లు పెరిగినవి.

బ్యాంకింగ్ డిపార్టుమెంటులో ఉన్న నోట్లు రూ. లు 558345000 చలామణిలో ఉన్న నోట్లు రూ. 10732944000.

## జమీందార్లకు పరిహారం

మదరాసు, నవంబరు 4: జమీందార్లకు పరిహారం యిచ్చేవిషయములో యింతకు పూర్వపు మంత్రివర్గములో నొకరు, జమీందార్లకు పరిహారముక్రింద రు 12½ కోట్లకు తగ్గకుండా యిచ్చెదమని యిచ్చిన మాటను నిలుపుకొనుటకు మదరాసు ప్రభుత్వము పంథా నన్వేషించుచున్నదని ప్రధాని శ్రీ కుమారస్వామి రాజా నేడు విలేఖరుల సమావేశములో తెలిపిరి.

జమీందార్లు కాంగ్రెసు అధిష్ఠానవర్గమునకు రాయబారము వెళ్లినప్పుడు జమీందార్లకు రు 12½ కోట్లకు తగ్గకుండా పరిహారము యిచ్చెదమని చెప్పినట్లు తెలియుచున్నది.

జమీందార్లకు యివ్వవలసిన పరిహారం లెక్కలు వేయగా హామీ యిచ్చిన మొత్తము నకు తగ్గి షుమారు 8 కోట్లువరకు వచ్చినట్లున్నా యిప్పుడు జమీందార్లకుయిచ్చెదమన్న తతిమా రు 4½ కోట్లను యివ్వవలసిన విధానమునుగురించి ప్రభుత్వము పరిశీలించుచున్నది. యిందునిమిత్తం రెండు రోజులక్రిందట బొబ్బిలిరాజా, వెంకటగిరి రాజాగార్లు ప్రధానిని కలుసుకొనిరి. అప్పుడు కాంగ్రెసు అధ్యక్షుడు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు, రివిన్యూ మంత్రి ఆర్థికమంత్రికూడ హాజరైరి.

జమీందార్లకు వెంటనే ఎంతమొత్తం చెల్లించవచ్చునో యింకా ప్రభుత్వము ఒక నిర్ణయమునకు రాలేదనికూడ తెలియుచున్నది. యిందుకు సంబంధించిన సవరణ బిల్లు వచ్చే అసెంబ్లీ సమావేశమున ప్రవేశపెట్టెదరు.

## వరంగల్ జిల్లాలో కాంగ్రెస్ ఎన్నికలు

### కమ్యూనిస్టు ప్రాంతంలో జరిగినా శాంతంగానే జరిగాయి

ఖమ్మంమెట్టు, నవంబరు 3: వరంగల్ జిల్లాలో కాంగ్రెసు ఎన్నికలు ఈ 1 వ తేది నుండి ప్రారంభమైనవి. చింతకాని నియోజకవర్గంనుంచి పట్టిపల్లి రామకోటేశ్వరరావు, పేరిపల్లి సత్యనారాయణ, అచ్చయ్య, ఎ. చేమయ్య. పర్చ శ్రీనివాసరావుగార్లు ఎన్నికైనారు.

బోనకల్ నియోజకవర్గం నుంచి పాకనూరి నారాయణమూర్తి, బొమ్మకంటి సత్యనారాయణ, సబోసేని రాఘవయ్య, బ్రాహ్మపల్లి రాజయ్యగార్లు ఎన్నికయ్యారు. ఈ రెండు నియోజకవర్గాలు కమ్యూనిస్టులు బలంగావున్న ప్రాంతంలో ఉన్నాయి.

కాని ఎన్నికలు శాంతంగానే జరిగాయి. (స్వ. వి.)

కథానిక:

# పనికిమాలిన సౌందర్యం

షికారుకెళ్లిన జమీందారు [illegible] ప్రసాద్ తిరిగివస్తూ [illegible] పోటుకు పోవటానికి సిద్ధంగా [illegible] చూచి [illegible] చూపులతో కళకళలాడుతున్న [illegible] మైన కనులు, [illegible] న్న అలల నురుగులు, చంద్రబింబంలాగా తీర్చి దిద్దినట్లున్న వదనము, ఆ [illegible] నిలచిపోయాడు. భార్య సీతాదేవి తన భర్త వచ్చినదికూడా గమనించనట్లు బండివైపు నడచిపోయింది. ఆవల్లనివరుసలలో అర్ధచంద్రాకారంతో ముడువబడిన ఆ పన్నా జాజిపూవులనుండి వచ్చేసువాసన తనుమాత్రంగా పైనబికి చలిస్తూ చక్కిలిగింతలు పెట్టే ముంగురులు—అతని నిశ్చలతను భంగంకలిగించేవాయి. మెల్లగా భార్యదగ్గరకువెళ్లి,

'నాన్నింటుహాలుకు పోతున్నావా?' అని అడిగాడు.

'అవును'

'నేనుకూడ నీతో రావచ్చునా?'

'నిరభ్యంతరంగా"

ఆమాటలలో వుండే కాఠిన్యాన్నయినా తెలుసుకోకుండా బండిలోకెక్కి, భార్య ప్రక్కన కూర్చున్నాడు. బండిబయలుదేరి పోతూంది. గుఱ్ఱపుడెక్కలచప్పుడు తప్ప వేరేశబ్దమేమీ లేదు. భార్య నెలాపలకరించాలో అని ఆలోచిస్తున్నా కఠినంగా కనపడే ఆమెమూపు లాతనిని మాట్లాడనివ్వాయికావు. చిట్టచివరికతడు తనచేతిని మెల్లగా ఆమె మెత్తని చేతిపై వేశాడు. వెంటనే ఆమె తన చేతినతనికు విదిలింపుగా తీసుకొంది. ఎలాగయితేనేమి తెగించుకొని 'సీతా' అని పలకరించాడు. ....

'ఏమిటి'

'ఎందుకంతకోపం?'

ఆమె జవాబీయలేదు. దట్టంగా పెరిగిన చెట్లనున్నట్లుగా ప్రవహిస్తున్న నది వంతెన మీదుగా బండిపోతూంది. పడమటి కొండల్లోకి పరుగిడుతున్న సూర్యుని కిరణాలు నదీజలంపైపడి ఓచక్కని అందాన్ని ప్రతిబింబింప జేస్తున్నాయి. ఇదంతా తిలకిస్తున్న ప్రసాద్ మెల్లగా 'సీతా' అని పిలిచాడు.

ఇక భరింప లేనన్నట్లుగా 'శాంతంగా జీవింపనీయరా? నాకు నేను హాయిగా బ్రతికే అధికారంకూడా లేదా?' అని అంది సీతాదేవి.

తానువినలేదన్నట్లుగా 'నీవు ఈరోజు కనుపించినంత అందంగా మరెన్నడూ కనుపించలేదు సుమా!'

ఓర్చలేక కోపంతో 'మీరు పొరబడ్డారు. నేను మీకు మరల అవిధంగా ఉపయోగించ తలచలేదు.'

ఆశ్చర్యంగా 'అంటే?'

బండివాడుకూడా వినకుండా మెల్లగా 'అంటే చెప్పమన్నారా?'

'అవును'

'మీ స్వార్థానికి బానిసనుగా అనుభవించిన బాధనంతా వెడలగక్కమన్నారా?'

'అవును ఏమిటో విషయమంతా చెప్పు'

'మీరు కొన్ని అనుమానకరమైన విషయాలు వినబోతున్నారు. నేనూ నిర్భయంగా చెప్పదలచాను కూడాను.'

ప్రేమాస్పదమైన చూపులతో ఆమె కనులలోనికి చూస్తూ 'నీవు పిచ్చిదానవై పోతున్నావు దేవి.'

'లేదు. పన్నెండు సంవత్సరాల నుండి మీ స్వార్థానికి బానిసనుగా చేసుకొని బాధించిన బానిసత్వ భరింపనలవలేదు. నేనూ ప్రపంచంలో ఒక స్త్రీగా బ్రతికే తలంపుతో ప్రతి స్త్రీ చేయదగిన పనిచేయదలచాను.'

కళావిహీనమైన కాంతిలో 'నేను నిన్ను అర్థం చేసుకోలేకున్నాను.'

'అవును. మీరు నన్ను బాగా అర్థం చేసుకున్నారు. చిట్టచివరికి పిల్లకలిగి మూడునెలలే అయినా మరలా నేనుఇంకా అందంగా వున్నాను. కదూ? స్వార్థపరులైన మీ కోర్కెలన్నీ నాపై ప్రతిబింబింప జేసినా, నారూపును మార్చలేకపోయారు. పురిటిగదినుండి బయట కాలి పెట్టటమే తరువాయిగా మళ్ళీ యంత్రంలాగా పనిచేయించాలని కాదు మీరు కోరేది?'

'నీవు అనవసర ప్రసంగం చేస్తున్నావు సుమా.'

'లేదు, అలసిపోయాను. పెండ్లి అయి పన్నెండేళ్ళే అయినా ఏడుగురు బిడ్డల తల్లినయాను. మరల నన్ను పీల్చి పిప్పిచేసి ఎముకలగూడు నవతల పారవేయాలని కాదూ మీ కోర్కె?'

చేతిలోనిముఱుతూ ఇక నాతో ఈ విధంగా మాట్లాడకు.'

"లేదు. నేను చెప్పదలచినదంతా చెప్పితీరాలి. మీరొకవేళ అడ్డగించ తలిస్తే పెద్దగా అరచి బండివాడుకూడా వినేటట్లు చేస్తాను. నేను మిమ్మెందులకు రమ్మని కోరింది కూడా. కాబట్టి జాగ్రత్తగా వినండి. మీరంటే మొదటినుండి నాకు అయిష్టమేనని మీకు తెలుసు. నేనేమీ అబద్ధమాడుట లేదు. నాకు యిష్టం లేకపోయినా కష్టకాలంలో వున్న నా తలిదండ్రులకు ధనాశచూపి దుఃఖ సముద్రంలో వున్న నన్ను వప్పించి పెండ్లి చేసుకున్నారు. మీరు భాగ్యవంతులనుటయే దీనికంతకు కారణం. నేను చేసుకున్న నేరానికి అయినదంతా మరచిపోయి భర్తను ప్రేమించటమే భార్య విధిగా గ్రహించినా చేతనైనంతవరకు మిమ్ముల ప్రేమించుట మొదలుపెట్టాను. కాని మీరో-అనుమాన పిశాచంతో నాకు కాపలాగా తయారై షికారులకు కాని, సినిమాలకు గాని, కనీసం తోటలోకైనా పోనీయకుండా వంటరి జీవితం నాలుగు గోడల మధ్యనే గడిపేటట్లు చేయాలని చూశారు కాదు? కాని నా అందం విషయంలో కాని, ఇతరుల మన్ననలకు పాత్రురాల నయ్యే విషయంలో కాని, అందరూ ఈమె కూడ ఒక అందమైన స్త్రీ అని చెప్పుకొనే విషయంలో కాని ప్రతిఘటించ లేకపోయారు. కాదంటారా? కొంతకాలంవరకూ ఇదంతా అర్థంచేసుకో లేకపోయాను. కాని తరువాత మీరు వీ చేష్టలకు, సంతోషిస్తూ మీ చెల్లెలుతో చెప్పారు కాబోలు నేనంటే ఆదరించే ఆమె మీ క్రూరత్వానికి విసిగి నాతో చెప్పటమువల్ల తెలుసుకో కలిగాను మీరు పెట్టిన కష్టాలు గుర్తు తెచ్చుకోండి తలుపులు బ్రద్దలు కొట్టటమేనా తాళాలు వేయటమేనా ఆఖరుకు చల్లని గాలినైనా సరిగా పీల్చుకోనిచ్చారా? కడుపుతో నున్న ఇప్పుడు మా [illegible] విసుగుచెంది ప్రసవించడానికి పల్లెటూరికి పంపించారు. కాని మరల శుభ్రంగా, అందంగా, ఒక సనికురాలిగా, సంఘానికి చెందిన ఒక యవ్వనవతిగా తిరిగివచ్చిన వెంటనే మీరిప్పుడు బాధపడుతున్న తుచ్ఛమైన కోర్కెలతో బాధించి పీల్చివేశారు. నేను మిమ్ముల కాదనకలేకపోయినా నన్ను మీ దరి చేర్చుకోవాలనే కోర్కెలో కాక ఒక ఆట వస్తువుగా భావించి మీతృష్ణను తీర్చుకున్నారు. ఈ తృష్ణను మీ కన్నులలో అనేక పర్యాయములు చూసి తెలుసుకో కలిగాను. మీ సంతానాన్ని మీ రక్త సంబంధీకులుగా కాకుండా మీ విజయ చిహ్నాలుగా ప్రేమిస్తున్నారు. వాళ్లంతా నా యవ్వనానికి, నా అందానికి, నా మృదువైన అవయవశోభకు, నిష్కలమైన హృదయాన్ని స్పందింపజేయగలిగిన మీ తీపిమాటలకు విజయచిహ్నాలు. వాళ్లను మట్టూ చేర్చుకొని సంతోషంలో షికార్లకు, సినిమాలకు తీసుకొనిపోతూంటే చూసే ప్రజలంతా 'ఎంత ప్రేమగలతండ్రిరా!' అని అనుకుంటూంటే ఇంకొకసారి వినాలని కుతూహలపడే, మీ ఉబలాటమూ—ఇదంతా నాకు చూచి గర్వించేకాదు? అని అడిగింది.

ఆమె బాధతో ఇంచుమించుగా అరచినట్లు తోచినా సహించలేక కోపంతో నెమ్మదిగా 'అవును నేను నా పిల్లల ప్రేమిస్తున్నాను-వింటున్నావా? నీవు ఇప్పుడు చెప్పినదంతా ఒకటిల్లి చెప్పవలసినదిగా లేదు. నీవు నాదానవు. నేను నీకు భర్తను. నేను ఎప్పుడు ఏమి నీనుండి పొందాలనుకుంటానో దాన్ని పొందే అధికారం నాకున్నది.' అంటూ ఆమె మృదు హస్తాన్ని కంపిలు తేరిన తన కఠినహస్తాలతో నొక్క మొదలుపెట్టాడు ప్రసాదు. ఆమె ఆబాధ భరించలేక, విదిలించుకోనేశక్తిలేక రెండు కన్నీటిబొట్లు రాల్చింది.

'తెలిసిందా నేను నీకు భర్తను బలవంతుడనుకూడా' అంటూ ప్రసాదు చేతిని వదలాడు.

ఆమె 'నాకు దేవునియందు విశ్వాసమున్నదని మీకు తెలుసుగాదూ?' అని అడిగింది.

'అవును'

'నేనేడైన దేవునితో నిమిత్తంలేకుండా ప్రమాణంచేసి చెపితే అబద్ధం చెపుతున్నానని తలుస్తారా?'

'లేదు'

'మీరు నాతో మన దేవాలయమునకు రాగలరా?'

'ఎందుకు?'

'మీకే తెలుసుకుంటారు'

'నీవు తప్పక రావలెనని కోరితే పదో' ఆమె ధ్వనిని పెద్దదిచేసి బండివానితో

'రామూ, బండి వెనుకకుత్రిప్పి దేవాలయమునకు పోనియ్యి' అని చెప్పింది.

త్రోవలో ఒకరినొకరు పలుకరించలేదు. బండి దేవాలయం చేరిన వెంటనే ప్రసాద్ బండి దిగి దేవాలయంలోకి వెళ్ళాడు. వెనువెంటనే కొద్దిదూరంలో సీతాదేవి భర్తను పరిశీలించింది. చాల సేపటివరకు ఆమె దేవుని ప్రార్థించి చేతులతో ముఖాన్ని మూసేసుకుంది. జనంకమున్న ప్రసాద్ ఆమె నిశ్చలంగా ఏడుస్తున్నట్లు బలహీనంవల్ల వణికే చేతిస్పర్శవల్ల గ్రహించకలిగాడు. కాని పరిస్థితి చాలవరకు విషమించినదని గ్రహించి ఆమె భుజంపై చేయి వేశాడు. ఆమెను దహిస్తున్నదా అని అనుపించే ఆ స్పర్శ ఆమెను జాగ్రదవస్థకు మేలుకొలుపటమువల్ల ఆమె తనవాడి చూపులతో ప్రసాద్ కనులలోనికి చూచి "మీరు నన్ను ఏమిచేసినా, ఆఖరుకు చంపదలచుకున్నా నేను చెప్పదలచింది చెపుతున్నాను. మీ పిల్లలలో ఒక్కడే-ఒక్కడు మీకు జనించినవాడు కాదు.

**మేళ్లచెర్వు వెంకటసీతారామశాస్త్రి**

మీరు నాకు చేసిన దారుణానికి ఫలితంగా మీ దృష్టిలో నేను పిల్లల కనుటకే నన్ను విధానంతో నే నాపగ తీర్చుకున్నాను. మీరు ప్రతి పురుషుని నేను ప్రేమించినవానిగా భావించి అనుమానించినా మీరు నా ప్రేమమూర్తిని తెలుసుకోలేరు. నేను అతనికి ప్రేమ — సంతోషము రెండూ లేకుండానే నాపగ తీర్చుకొనుటకు నన్నాతనికి సమర్పించుకున్నాను. తత్ఫలితంగా నన్నాతనొక మాతనుగా చేశాడు. నా ఏడుగురు పిల్లలలో వాడెవరో ,,కూడ మీరు తెలుసుకోలేరు. మోసంచేస్తూ ఆ మోసం తెలియనీయకుండా ఒకడు మరొకనిని కష్టపెట్టి పగ సాధించలేడని ఈ రోజు నన్ను మీరు తెలిసికొనునట్లు చేయటమువల్ల తరువాత చెపుదామనుకున్న ఈ వృత్తాంతాన్ని ఇవాళనే చెప్పి పూర్తిచేశాను.' అని చెప్పి ఆమె వెనక్కు తిరిగి వెళ్లుతూనే తన్నాతడు అక్కడనే నేలకూరిపోగటట్లు కొట్టుటకు వస్తున్నాడేమో నని అతని పదశబ్దమేమైనా వినిపిస్తుందేమో నని శ్రద్ధతో ఆలకిస్తూ ఆ విధమైన శబ్దమేమీ రాకపోవటంచేత భయంతో వణకుతూ వెంటనే బండిలో ఎక్కి 'రామూ ఇంటికి తీసుకెళ్లు' అని చెప్పింది.

సీతాదేవి భోజనాని కెదురుచూసే సైదీలాగా తన గదిలో కూర్చొని భోజనమునకొరకెదురుచూస్తూ అతనేమి చేయ నిశ్చయించుకున్నాడు? అసలు ఇంటికి వచ్చాడా? అంతా నిశ్శబ్దంగా నేవున్నదే! అని ఆలోచిస్తున్న సమయంలో దాసి వచ్చి 'భోజనం సిద్ధంగా వున్నదమ్మా' అని చెప్పి ఆమె ఆలోచనకు భంగం కలిగించటమువల్ల దాసిని నాకు వచ్చారా? అని ప్రశ్నించింది.

'వచ్చారమ్మా భోజనాలగదిలోనున్నారని' చెప్పి దాసి వెళ్లిపోయింది.

కొన్నిరోజుల క్రితమే తెచ్చిన పిస్తలును దుస్తులలో భద్రపరచుకొని పిల్లలంతా ఒకచోటనే వుంటారనే తలంపుతో ఒకనూనె సీసాను తీసుకొని బయలుదేరింది. సీతాదేవి. మాష్టరు రామమూర్తి దగ్గర చదువుకొంటూన్న ముగ్గురు పెద్ద పిల్లలను, దాని మంగళో ఆడుకుంటూన్న ముగ్గురు ఆడపిల్లలను, మూడునెలల చిట్టచివరిపిల్లదాని తేషుచేతిలో ఉంటం చూచి నిశ్చింతగా భోజనాలగదిలో కెళ్లింది. పిల్లలుకూడ నూనూలు ప్రకారం గదిలో కెళ్ళి కత్తిపేసినా వెనుక చుక్కలేక పాలిపోయిన తండ్రి మొగము, భయంతో వణికిపోతూన్న తల్లి మొగము చూచి నోరు గోలచేస్తే వాస్తుకూడ ఏమీ మాట్లాడకుండా భోజనం చేయ మొదలుపెట్టారు. వండిళ్లానులు, బ్రాకెల చప్పుడు తప్ప వేరే శబ్దమేమీ లేదు. కాని అనుకోకుండా నీ పిల్లల గురించి నీవు చెప్పినదంతా నిజమేనా? అని ప్రశ్నించాడు ప్రసాద్ కఠినంగా.

రక్తనాళాల్లో దాగుని వున్న అనుమానంపైకు బకటంగల్ల పూర్వం చెప్పినట్లుగానే ఒక చేతిని మొగపిల్లల వైపు మరొక చేతిని ఆడపిల్లల వైపు చూపిస్తూ కోపం లేకుండానే, ప్రమాణ పూర్వకంగా నేను చెప్పినదంతా నిజమే, అని చెప్పింది సీతాదేవి.

పిచ్చివానిలాగా లేచి తన కుర్చీని గోడకు విసరికొట్టి మరేమీ మాట్లాడకుండా బయటకెళ్ళి పోయాడు ప్రసాద్.

బహిర్గతం కాని విజయ చిహ్నంగా పెదిమలపై కనుపించీ కనుపించని చిరునవ్వుతో మీ నాన్నగారు బడలికగా నుండటముచే జరిగిన దానిని గురించి మీరేమీ విచారించకండి, కొద్దిరోజులకే ఎప్పటిలాగు తేరుకుంటారు అని పిల్లల బుజ్జగించి తనగదికెళ్లి రాత్రి చాల సేపటి వరకూ ఏమైనా జరుగుతుందేమో నని నిరీక్షించింది. కాని అటువంటిదేమీ జరుగక పోవటమువల్ల లోగడియ వేసుకొని నిద్రపోయింది. మరునాడు ఉదయం కాఫీ తెచ్చిన దాసి ఒక కవరిచ్చి 'అయ్యగారు విదేశాలకు పోతున్నారని మీకు కావలసిన డబ్బు ప్రధానోద్యోగి నీయమని చెప్పారని' చెప్పి వెళ్ళిపోయింది.

ఆరు సంవత్సరాలు గడచిపోయినై. ఇందులో చాలకాలం ప్రసాద్ విదేశాలలోనే గడిపాడు. సీతాదేవి కూడ వృద్ధురాలై, నవయవ్వనంతో చూపరులకాకర్షణీయంగా కనుపించేలా లేకుండి. ప్రసాద్ ఇంటికొచ్చిన తరువాత కూడ భార్యతో మాట్లాడలేదు.

ఒకరోజు సినిమానుంచి ఒకరి ప్రక్క ఒకరు కూర్చొని బండిలో వస్తూండగా ప్రసాద్ 'దేవీ' అని పిలిచాడు.

'ఏమికోరుతున్నారు?' అంది సీతాదేవి

'నాకు విధించిన ప్రాయశ్చిత్తానికి ఫలితంగా ఆరుసంవత్సరాలు గడచినయి కాదు?' అన్నాడు.

'నేనేమి చేయగలను'

'ఆ ఏడుగురిలో వాడెవరో చెప్పవా?'

'చెప్పలేను'

'ఈ అనుమాన పిశాచంతో ఇకవాళ్ళను నా పిల్లలని - ఆఖరుకు వాళ్ళు పాకులనైనా సహించలేనని తెలుసుకో. వాడినికూడ తిరిగి మ్మా పిల్లలలాగా చూసుకుంటానని ప్రమాణపూర్వకంగా చూసుకుంటానని ప్రమాణపూర్వకంగా చెప్పుతున్నా—ఇప్పటికైనా రహస్యం బయటపెట్టు. ఈ అనుమానమే వాళ్ళను చూడటానికికూడ సహించలేనంత పిచ్చివానిగా చేసి బాధిస్తున్నది అని అన్నాడు ప్రసాద్.

'మీరింత బాధపడుతున్నారన్నమాట?'

'ఇంత ఏంటి? ఈ అనుమానమే నేను నీప్రక్కన కూర్చోవాలన్నా-నా పిల్లలనైనా ప్రేమతో చూచుకోవాలనుకున్నా అశక్తునిగాచేసి దహిస్తున్నది.'

'మీరునిజంగా బాధపడ్డారు' అంది విచారంగా.

'ఇదివరలో నానిండు హృదయంతో నాపిల్లల ప్రేమించానన్న సంగతి నీకూ తెలుసు. కాని ప్రస్తుతం నేను వాళ్ళకు పూర్వపు తండ్రినీ కాదు - నీకు పూర్వపు భర్తనూ కాదు. నీ అభిరుచులు, నీ హృదయం నానుండి వేరని గ్రహించే సహజమైన మానవునిలా మారగలిగాను. నీవు చెప్పినదంతా విని మరువలేక పోయాను. మరువలేకనే బాధపడ్డాను. కాని ఆరోజునుండి నీగురించి నామనస్సును బాధపెట్ట తలచుకోలేదు. నాపిల్లలెవరో తెలుసుకోవాలనే తలంపుతోటే నిన్ను చంపలేదు. నేనిక్కడికొచ్చిన తర్వాత ఎప్పుడైనా నాదగ్గరకొస్తే 'వీడునావాడేమో!' ననే తలంపుతో బాధపడి ఎంతక్షోభించానో నీకు తెలుసుననుకుంటాను. ఇకనైనా నిజం చెప్పు. ఎవరికీకూడ కీడు తలపెట్టనని ప్రమాణంచేస్తున్నాను. చెప్పవూ? అని అడిగాడు ప్రసాద్.

'నేను మీకనుకొనే దాని కన్న గొప్ప అపరాధినని చెప్పాలి. కాని, ఈపిల్లల కనటమనే బాధను భరించలేక పోయాను. మిమ్ములను నాప్రక్కనుంచి వేరు చేయాలనే భగవంతుని ఎదుట అబద్ధమాడాను. అంతేకాని మీకు నేనేమి ద్రోహం చేయలేదు' అని అంది జాలిగా.

ఆచీకటిలో 6 సం॥ క్రిందట [illegible] పొందిన భావాలతో ఆమె చేతిపై తన చేయివేసి ఆశ్చర్యంగా 'ఇది నిజమా?' అని ప్రశ్నించాడు ప్రసాద్.

'అవును నేను నిరపరాధినని' అంది సీతాదేవి.

'కాని నన్నిప్పుడు సందేహాలపై సందేహాలు బాధిస్తున్నయి. ఒకసారి అబద్ధమాడిన నిన్ను ఇప్పుడేలా నమ్మ కల్గను?' అని అన్నాడు. బండి భవనాన్ని చేరుకుంది. ముందు ప్రసాద్ దిగి తన చేతిని భార్యకందిచ్చాడు. మెల్లగాదిగి గదిలోకి పోతూన్న భార్యను చూచి 'నేను నీతో కొంచెం సేపటివరకు మాట్లాడవచ్చునా?' 'తప్పకుండాను' అని తన అంగీకారాన్ని తెలియజేసింది సీతాదేవి.

గదిలోకివెళ్లి కూర్చున్నారు. జవానులైట్లు వెలిగించిపోయినవెంటనే ప్రసాదు, 'నేను నిజం తెలుసుకోవేది ఎట్లా? నిన్ను నిజం చెప్పుమని అనేకపర్యాయములు బతిమిలాడినా మూగదానిలాగా మాట్లాడలేదు. కాని ఈ రోజు అబద్ధమాడానని చెప్తున్నావు. ఈ ఆరుసంవత్సరాలు నీవు చెప్పినదాన్ని నమ్మేటట్లు చేశావు. నీవు నిజమే చెపుతున్నావా? లేదు ఇపుడుకూడ అబద్ధమే చెపుతున్నావు. ఎందుకానింతగా చెపుతున్నావో అర్థం చేసుకోలేకున్నాను. నామీద జాలికలిగెనేమో?" ప్రశ్నార్థకంగా అని పూరుకున్నాడు.

'లేదు నేనబద్ధమాడటంలేదు. నేను పూర్వమూ విధంగా అబద్ధమాడకుండా ఉన్నట్లయితే ఇప్పటికింకా నలుగురు పిల్లలతల్లినయి యుండే దాన్ని' అని అంది

ఆశ్చర్యంగా 'ఏ తల్లి అయినా ఈవిధంగా మాట్లాడగలదా?'

'నేను పుట్టిన పిల్లలకు తల్లిగా వుండటానికి వప్పుకోను. నాకున్న పిల్లలుచాలు. వాళ్లని హృదయపూర్వకంగా ప్రేమిస్తూ వాళ్ల క్షేమ సమాచారాలు చూసుకుంటే చాలు. నాకు జ్ఞానమున్నది. ప్రపంచమంటే ఏమిటో నాకు తెలుసు. ఇక నేను పిల్లలకనే యంత్రంలాగా వుండలేను.' అని అంటూ లేవబోయింది. కాని ప్రసాదు చేతితోపట్టుకొని 'ఒక్క చేమాట - నాకు నిజంచెప్పు' అని అడిగాడు. 'నేనంతా చెప్పాను. నేను మీకేమీ ద్రోహంచేయలేదు.' ప్రసాదు ఆమె మోమును బాగా పరిశీలించాడు. వర్షఋతువులో ఆకాశంలో నీటితో బరువెక్కి చలిస్తుంటే మబ్బులాగా కనుపించే ఆకన్నులు, నల్లని ఆకాశంలో మినుకు మినుకు మంటూ ప్రకాశించే నక్షత్రాల్లాగా ఆనల్లని కురులలో ప్రకాశిస్తున్న ఆవజ్రాలు - పున్నమనాటి చంద్రునిలాగా ప్రకాశిస్తున్న ఆ మోముకెంత శోభను చేకూరుస్తున్నయి. తుచ్ఛమైన (విషయ) కోర్కెలకు తావులేదన్నట్లు ప్రకాశిస్తున్నట్లు ఆ సుందర ప్రతిమ నల్లా చూస్తూ - ఆహృదయ నిర్మలినాన్ని, తనపూర్వపు ద్వేషాన్ని, తనతప్పుడు నడవడిని మననంచేసుకుంటూ—ఇప్పటికి తెలుసుకోకలిగానన్నట్లు అపయత్నంగా,

'నీవు అబద్ధమాడలేదని, అబద్ధమాడవని ఇప్పటినుంచి నమ్ముతున్నాను దేవీ' అని అన్నాడు.

ఆమె తనచేతి నాతనిపైవేస్తూ 'ఇదిపనికిమాలిన సౌందర్యమని తెలుసుకొని నన్ను మన్నించినట్లయితే మనమిద్దరము స్నేహితులమే కదూ?' అని, అంది చిరునవ్వుతో.

ఆమెను దగ్గరకు తీసుకొంటూ 'అవును మనము స్నేహితులమే. ఇది పనికిమాలిన సౌందర్యమే దేవీ!' అని నిర్మలప్రేమతో ఆమెపైపు చూస్తూ 'చాల అందంగా వున్నావు దేవీ' అంటూ బయటకెళ్లిపోయాడు ప్రసాదు. (మొపాసా ఆధారం.)



# హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ - చీలికలు

రచన
డా॥ జి. ఉపేంద్రరావు

హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్ రాజకీయాలూ, అందులో ఏర్పడిన పార్టీలూ, తగాదాలూ సులభంగా గ్రాహ్యమయ్యేవి కావు. సంస్థాన కాంగ్రెసు జీవితం మూడు సంవత్సరములు నిండలేదు.

అంతకు పూర్వం ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక మహాసభలపేరుతో కొంత ప్రజాసేవ జరుగుతుండేది. 1946 జూనులో కాంగ్రెసుపై నిషేధం తొలగింపబడింది వెంటనే వివిధప్రాంతాల రాజకీయ నాయకులందరూ కాంగ్రెసులోచేరి అందులో ప్రముఖస్థానాలను ఆక్రమించుకోడానికి ప్రయత్నించ నారంభించారు. అఖిల భారత కాంగ్రెసుకు అనుబంధ సంస్థగా వుండటంవల్ల సంస్థానకాంగ్రెసును ప్రజలు విపరీతంగా ప్రేమించసాగారు. ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక నాయకులు అఖిల హైదరాబాద్ నాయకత్వమును ఆశించి కాంగ్రెసులో తామే పలుకుబడిలోకి రావాలని వివిధ పార్టీలవారు కృషిచేయ సాగారు.

గత మూడు సంవత్సరాల కాంగ్రెసు చరిత్రను తిలకించినచో ఈ నాయకాగ్రణులు కాంగ్రెసులో జరిపిన కృషి కేవలం సంస్థలో అధికారం కైవసం చేసుకోవడానికే వినియోగించినట్లు కనపడుతుంది. హైదరాబాద్ ప్రజానీకం కాంగ్రెసుపై ప్రదర్శించిన శ్రద్ధాభక్తులు నాయకుల కృషివలన కాదనీ కేవలం మహదాశయాలలో కూడు కొన్న కాంగ్రెసు సంస్థపైన ప్రజలకున్న అభిమానమేనని బోధపడుతుంది. పోలీసు చర్య జరిగిన తరువాతకూడా కాంగ్రెసులో యేర్పడిన భేదాలు యే తాత్త్వికాభిప్రాయాలమీదా ఆధారపడి యుండలేదు. అధికార వ్యామోహమే ఈ 'పార్టీ'లకూ ముఠాలకూ కారణం. భారత ప్రధాని పండిట్ నెహ్రూ, ఉపప్రధాని సర్దార్ పటేల్ హైదరాబాద్ విచ్చేసిన సందర్భంలో కాంగ్రెసు నాయకులకు యిచ్చిన ఆదేశాలవల్ల పరిస్థితులు చక్కబడితేనని ప్రజలు ఆశించారు. కాని హైదరాబాద్ ప్రజలయొక్క, వారి అభిమానపాత్రమైన కాంగ్రెసుయొక్క దురదృష్టమేమో గాని ప్రజల ఆశలు అడియాసలైనవి ప్రజలలో కాంగ్రెసుపై అభిమానం సడలిపోతూ హెచ్చవుతున్నప్పటికీ నాయకులు తమ బాధ్యతలను గుర్తించ లేకున్నారు.

## సంస్థాన కాంగ్రెస్ వివిధపార్టీలు

స్వామి రామానందతీర్థ కాంగ్రెస్ కొరకు 1938 నుంచి తీవ్రంగా కృషిచేసి అనేక పర్యాయాలు నిర్బంధాలకు గురియై హైదరాబాద్‌లో అధికంగా ప్రజావిశ్వాసాన్ని చూరగొనిన వారిలో ప్రముఖులు. ఈయన బ్రహ్మచారి, యతీశ్వరుడూ కావడంవల్ల రాజకీయేతరంగా కూడా ప్రజలకు వీరిపై గౌరవం మెండుగాకలదు. అయినప్పటికీ సంస్థ రాజకీయాలలో ప్రముఖ పాత్రను వహించవలసి వచ్చినప్పుడు సంస్థలో వివిధపార్టీలు యేర్పడివున్నప్పుడు ఏదేని ఒక పార్టీతో సంబంధం పెట్టుకొనక తప్పింది కాదు. అందువల్లనే (స్వామీజీకి మహారాష్ట్ర) నాయకుడైన గోవిందాస్ షరాఫ్ కర్ణాటక ప్రాంతంలోని యువక ప్రముఖులు. శ్రీ ప్రాణేశాచార్య, కృష్ణమాచారి జోషిగార్లు, ఆంధ్రులలో అభ్యుదయ కాములమనుకొనే వరంగల్లు నల్లగొండ యువక నాయకులూ కలసి అనుచర వర్గంగా తయారైంది. అయితే వరంగల్లు నల్లగొండ జిల్లాలలోని యువక కాంగ్రెస్ నాయకులలో కూడా అనేక అభిప్రాయభేదాలు వున్నాయి. తెలంగాణా అధికార కాంగ్రెసుకు అనుకూలంగా వున్న వర్గం ఒకటి, ఈ వర్గంతో అసంతృప్తి చెందిన వర్గం మరొకటి వున్నాయి.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధికారాసనాన్ని అలంకరించి అవసర సమయంలో అటు బూర్గుల రామకృష్ణారావుగారి వర్గాన్ని, ఇటు స్వామీజీ వర్గాన్ని కూడా వుపయోగించుకుంటూ తమ పలుకుబడిని ఏదో విధంగా శాశ్వత పరచుకోవడానికి ప్రయత్నిస్తూ వచ్చిన శ్రీ జమలాపురం కేశవరావువర్గంవారు ఈ సమయంలో స్వామీజీకి అనుకూలంగానే వున్నారు. శ్రీ జమలాపురం వారి అవకాశవాద విధానాలతో అసంతృప్తి పడిన తెలంగాణా యువకులు శ్రీ కోదాటి నారాయణరావు గారితో తెలంగాణా కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీ చేయిస్తున్నారు. శ్రీ కేశవరావుగారు కూడా తిరిగి తన స్థానాన్ని నిలుపుకోదలచారు. ఈ పరిస్థితులలో స్వామీజీకి అనుకూలంగా ఏ వర్గం నిలవగలుగుతుందో చెప్పలేము. పై వర్గాల మధ్య రాజీ కుదిరితే స్వామీజీకి పూర్ణంగా బలం లభిస్తుంది. స్వామీజీ ఇచ్ఛకూడా అదే. వీరిద్దరి మధ్య సమన్వయము కుదిరేటట్లు కనిపించడంలేదు. స్వామీజీకూడా ఒక గ్రూపు యొక్క సంఖ్యా బలాన్ని బట్టి ప్రాధాన్యం యిస్తూ వచ్చారు గాని వారి చిత్తశుద్ధిని యెన్నడూ లక్ష్య పెట్టలేదు. శ్రీ కేశవరావు, నారాయణరావు గార్ల బలాలు దాదాపు సరిసమానంగానే రావచ్చు. శ్రీ కేశవరావు వర్గం వారు శ్రీ నారాయణరావు గారిని ఉపసంహరించుకొనేటట్లు చెయ్యమని స్వామీజీని యిప్పుడు కోరుతున్నప్పటికీ చివరి గడియలలో తప్పని సరియైనప్పుడు శ్రీ నారాయణరావు గారి అభ్యర్థిత్వాన్ని రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష స్థానానికి బలపరుస్తూ కేంద్ర కార్యవర్గ సమితిలో తమ వర్గీయులకు ఎక్కువ ప్రాతినిధ్యం వచ్చుటకు ప్రయత్నించవచ్చు.

తెలంగాణా అధ్యక్ష పీఠానికి వీరు అభ్యర్థులు కారు. ఆంధ్ర కాంగ్రెస్ కార్యదర్శి అయిన శ్రీ వేములపల్లి భాస్కరరావు గారూ శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారి పక్షానికి చెందిన శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారో లేక శ్రీ [illegible] గారో పోటీ చేయనున్నారు. శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారి వర్గం, పాత కాంగ్రెస్ అధ్యక్షులుగా వుండిన శ్రీ జనార్దనరావు దేశాయి మరియు పెక్కు మంది ఆంధ్ర కర్ణాటక ప్రముఖులలోనూ కూడుకొనిన ఒక బలిష్టమైన వర్గమని చెప్పవచ్చు. స్వామీజీని ఎదుర్కొనే వర్గం యిదే. ఈ వర్గమునకు మూల విరాట్టు శ్రీ కొండా వెంకటరంగారెడ్డి గారు. శ్రీ బూర్గుల వారు ఆ వర్గంలో ప్రముఖ నాయకులుగా వ్యవహరిస్తున్న కారణమునను యూనియన్ ఆంధ్ర నాయకుల శుభాకాంక్షలను పొందియున్నందు వలనను వారిని సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షస్థానానికి అభ్యర్థిగా నిలు

(12వ పేజీ చూడుము)

